జ్ఞాన యోగం

# భ్రాంతి రహిత శ్లోకములు



ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్
www.freegurukul.org

## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..








"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని ఆర్కైవ్ వెబ్ సైట్ నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) ఆర్కైవ్ వారి వెబ్ సైట్: https://archive.org
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్థం ఉచితంగా eBook రూపంలో ఆర్కైవ్ వారి సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Helpline/WhatsApp: 9042020123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

# ఆర్కైవ్ వారి వెబ్ సైట్:

# https://archive.org/

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీగురుభ్యోనమః

# భ్రాంతి రహిత శ్లోకములు

(సవ్యాఖ్యానము)



వ్యాఖ్యాత

శ్రీ యిలపకుర్తి వీరవెంకటరామ చంద్రరావు బి.ఏ. బియల్.

నర్సాపురం, ప॥ గో॥ జిల్లా

శ్రీగురుభ్యోనమః

# భ్రాంతి రహిత శ్లోకములు

(సవ్యాఖ్యానము)

## పీ ఠి క.

శ్లో॥ గురుర్బ్రహ్మా, గురుర్విష్ణు, ర్గురుర్దేవో మహేశ్వర :
గురుసాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురువేనమః

భ్రాంతి రహిత శ్లోకములు రచించిన మహామహులెవరో నిర్ధారణగా చెప్పజాలము. ఐనను 'భ్రమేణాహంభ్రమేణత్వం XXX' అను శ్లోకము యోగవాశిష్ఠములోనూ, "ఉల్కాహస్తోయథాకశ్చిత్ XXX" అను శ్లోకము ఉత్తరగీతలోనూ, మరి కొన్ని శ్లోకములు, శ్రీ శివరామదీక్షితీయమను బృహద్వాశిష్ఠము నందునూ, గానవచ్చు చున్నందున, యీ భ్రాంతిరహిత శ్లోకములు, వశిష్ఠాది మహర్షులచేతను, శ్రీకృష్ణాదిరాజర్షులచేతను, శ్రీ శివరామదీక్షితాది అచలర్షులచేతను, వ్రాయబడి యుండ వచ్చునని యూహింపదగును.

ఈ శ్లోకములు, పరిపూర్ణబోధ సిద్ధాంతమును, అనువదించుచూ, తద్బోధకెంతో ప్రామాణీకములై యున్నవి. కనుక యీ శ్లోకములకు శ్రీ మల్పీలు ఖానా శంకరరావుగారు క్లుప్తముగా తాత్పర్యము మాత్రమువ్రాసి గ్రంధస్తముచేసియుండిరి. ఈ శ్లోకములకు విపులంగా వ్యాఖ్యానము వ్రాసినచో. జననమరణ భ్రాంతి రహితము కోరి కృషి చేయు భక్తలోకమునకు, యింకనూ ఎంతో సహాయకారిగా నుండగలదని భావించి, ఈ శ్లోకములకు వ్యాఖ్యానము వ్రాసి ఒకటొక్కటిగా 1977 నుంచి, రాజయోగి వేదాంత మాసపత్రిక ద్వారా ప్రకటించుచూ వస్తిని. మిగతా శ్లోకములకు కుడా వ్యాఖ్యానము వ్రాసి పూర్తిచేయుడనిన్ని ముద్రణా వ్యయమంతము తాము భరించి గ్రంథరూపముగా అచ్చొత్తించగలమనిన్ని, 1) విజయవాడ కాపురస్తులు కీ॥శే॥లైన నోరి నారాయణ మూర్తి గారి సతీమణి శ్రీమతి అరవాలమ్మ 2) పశ్చిమగోదావరి జిల్లా నర్సాపురం కాపురస్తులు, కీ॥శే॥లైన రాచకొండ సూర్యప్రకాశ శాస్త్రిగారి సతీమణి కమలమ్మ 3) డిటో గ్రామ కాపురస్తులు కీ॥శే॥లైన చన్నాప్రగడ జగన్నాథరావుగారి సతీమణి వీరరాఘవమ్మ అనే విజయలక్ష్మి 4) విజయవాడ కాపురస్తులు కీ॥శే॥లైన మంచిరాజు శ్రీరామమూర్తిగారి ద్వితీయ కుమారుడు శ్రీనివాస మూర్తిగారలు కోరినందున యీ భ్రాంతిరహిత శ్లోకములు నేను రచించిన వ్యాఖ్యానముతో గ్రంథరూపముగా ప్రకటించి, ఆంధ్రలోకమునకు

సమర్పించుకొనుచున్నాను.

గ్రంథ ముద్రణ బారమంతయు వహించిన పైన వుదహరించిన భక్తాగ్రేసరులకు
నా హృదయపూర్వక కృతాజ్ఞతాభివందనములు, శ్రీ గురుపరమాత్మ కృపచే వారికి
సర్వభ్రాంతిరహితమై పరిపూర్ణ బోధయందారూఢతకల్గుగాక!

ఈ గ్రంథము అందముగా అచ్చువేసి సకాలమునకు పూర్తి చేసి యిచ్చిన వారికి
నా కృతజ్ఞత, శ్రీ సద్గురువరేణ్యులగు శ్రీమదచల ఋషి, దయానందపొన్నాల
రాజయోగీంద్రుల వారి దివ్యశ్రీచరణ సరోజములకు, మరియొక పూజా పుష్పముగ
యీ గ్రంథమును కృతి సమర్పణ గావించుకొనుచున్నాను.

ఇట్లు
బుధజన విధేయుడు
**యిలపకుర్తి వీరవెంకట రామచంద్రరావు**

నర్సాపురం
ప॥గో॥జిల్లా
23-3-83



# ముందుమాట

పరిపూర్ణ దర్శనాచార్య, సదానంద శ్రీ యిలపకుర్తి వీరవెంకట రామచంద్రరావు గారు, శ్రీ అచల ఋషి దయానంద పొన్నాల రాజయోగీంద్రుల వారి అనుగ్రహముచే వారి దివ్యాశీస్సులతో శ్రీ శివరామ దీక్షితీయ సాంప్రదాయమును తమ గ్రంథ రచనల ద్వారా బహుళ ప్రాచుర్యము చేసి పాఠక లోకమును ఉత్తేజితులుగా జాగృతమొనరించినారు. వారి శిష్య ప్రశిష్యులు వలయు ఆర్థిక సంపత్తిని సమకూర్చి వారి గురుభక్తిని వ్యక్తపరచుకొనుచునే ఉన్నారు.

అంతేకాక గురుధర్మ నిర్వహణలో శ్రీరామచంద్రరావు గారు దంపతులు జరిపిన కృషిని, గడిపిన ఆదర్శవంతమగు జీవితమును లోకములో ప్రచారం చేయుటకై గురుదేవుల ఆశయ సంసిద్ధి కొరకు "శ్రీశ్రీశ్రీ సీతారామచంద్ర పరిపూర్ణ బోధోపదేశ మందిర సంస్థ"ను గుంటూరు జిల్లా, మంగళగిరి మండలం, యర్రబాలెం గ్రామంలో ఏర్పాటుచేసి శ్రీ గురుదేవుల ఆదర్శమును లోక కళ్యాణార్థము వివరించడంలో వారికి గల సహాయ సంపత్తిని అందించుచున్నారు. ఇది సహృదయులు సంతసించి ప్రోత్సహించవలసిన అంశము.

శ్రీ రామచంద్రరావు గారి రచనలన్నియు వారి గురు దేవులు శ్రీ శివరామ దీక్షితీయ పీఠాధిపతులైన దయానంద పొన్నాల రాజయోగీంద్రులవారి దివ్యశ్రీ చరణములకు పూజాపుష్పములుగా సమర్పింపబడియున్నవి. అట్లే యీ భాగం కూడా యొక పూజాపుష్పంగా వారి చరణ సన్నిధి చేరాలని భక్తమండలి వారి తరపున శ్రీ గురుపరమాత్మను ప్రార్థించుచున్నాము.

ఇట్లు
భక్తమండలి తరపున
**మంచిరాజు శ్రీనివాసమూర్తి**

# శ్రీ గురుభ్యోనమః

ఈ గ్రంధమునకు ద్రవ్య సహాయము చేసిన జానకమ్మ, పార్వతమ్మ, లక్ష్మీకాంతమ్మ గార్ల జీవిత చరిత్రలోని కొన్ని ముఖ్య విషయములు.

గంజాం జిల్లా బరంపురం పట్టణవాస్తవ్యులు పరమ శివారాధకులు శ్రీ ఆకాశము మల్లికార్జున అన్నపూర్ణమ్మ గార్ల సంతానమే సర్వశ్రీ జానకమ్మ, పార్వతమ్మ, లక్ష్మీకాంతమ్మ. చిన్నతనము తల్లిదండ్రులు పర్యవేక్షణలో భక్తిమార్గములో పూజలు కీర్తనలతో శైవారాధన యందు చక్కటి కృషి సలిపి యున్నారు. తల్లి దండ్రులు ద్వారా వారికి అబ్బినది ఈ మహాదైశ్వర్యము అంతటితో ఆగక వీరి తండ్రిగారు రెండవ కుమార్తెయగు పార్వతమ్మను లేప్రాయమునందే ఆధ్యాత్మ చింతనకు మార్గము లేర్పాటు చేస్తూ ప్రధమములో రామాయణము, భారతము, భాగవతము, భగవద్గీత, పఠన, పాటన, విధి, విధాన మంతా అభ్యసింపజేసెను. యుక్త వయస్సు రాగ వివాహాది క్రియలు జరిపించిరి పూర్వజన్మ సుకృతంచే వీరి తండ్రిగారు ఆధ్యాత్మిక చింతనలో గురుని అవసరాన్ని గుర్తించి తమతో పాటు తమ కుమార్తెలకు కూడా ఆ వాసన ప్రభావాన్ని సంక్రమింప జేసిరి. తండ్రి ద్వారా భక్తి జ్ఞానములు, తల్లి ద్వార జ్ఞాన వైరాగ్యము ముక్తత్వముల యందు విషయ ప్రవేశము వారికి కలిగినది. జన్మరాహిత్య విధానమునకు శివరామదీక్షితీయ సిద్ధాంతమే సరియైన మార్గమని గ్రహించి, అందుకు వలయు ఆచార్యోప దేశమునకై వీరు నిరీక్షించుచూ, పలు సభలకు హాజరై వారి జిజ్ఞాసను పుస్తక పఠనము ద్వార పెంపొందించుకొనుచు ఈ పీఠాధ్యక్షులైన శ్రీ దయానంద పొన్నాల రాజయోగీంద్రుల వారిని దర్శించి వారి ద్వార సంప్రాదాయ మందలి నిర్దుష్ట విధానమును గ్రహించి, తమకందు బాటులో వున్న గురువులు, వారి ప్రభోధ ప్రచారములు, ఆచార విచారములు, సంప్రదాయ ధర్మమునకు భిన్నముగా నుండుటచే సద్గురోపదేశమునకు యెదురు చూస్తువున్న తరుణములో, వారి జన్మ పుణ్య ఫలప్రధమై అప్పటి రాజయోగి పత్రిక సంపాదకులు పరిపూర్ణ దర్శనాచార్య సదానంద శ్రీ యిలపకుర్తి వీర వెంకట రామచంద్రరావుగారి పరిచయ భాగ్యము వారి రచనలలో ప్రముఖమైన పరిపూర్ణ దర్శన గ్రంధము ద్వారా వీరికి కల్గినది. అందలి అంశము లన్నియు వారు గ్రహించి, వారి దర్శన, కృపలకు పాత్రులై జన్మ రాహిత్య విధానమునకు ఇట్టి అనుష్ఠాన, ఆచరణ, విచారణలతో కూడిన ఆచార్యత్వము కల్గిన గురూపదిష్ట మార్గమే శ్రేష్ఠమైనదని భావించి, వారి కృపకు పాత్రులై ఉపదేశ దీక్షగైకొని దీక్షితీయ సిద్ధాంతము నందలి భోధనా పద్ధతిని. మర్మధర్మములను (పరిపూర్ణ, ఎరుకుల వస్తు నిశ్చయ జ్ఞానమును, పిండ బ్రహ్మాండ విచారణ. తారక, సాంఖ్య, అమనస్క మహా వాక్యములు నిరూపన, కందార్ధ కంద పద్య వివరణ, ద్వాదశి, షోడశి భావములు విశేషార్ధ వివరణ) అనుష్ఠాన, ఆచరణ, విచారణ, పద్ధతుల ద్వార అధ్యయనము చేసి, శ్రీ రామ

చంద్రరావుగారి అపార కరుణకు పాత్రులై, జన్మసార్థకత గావించు కొంటిమని పరమశాంతితో దివ్య జీవనము, గురుభక్తి, గురుసేవ, గురునిష్ఠల ద్వార జరపుకొనుచున్నారు.

శ్రీ సధానందులు బ్రహ్మైక్యము చెందిన అనంతరము భోధయందుగల మర్మధర్మములు సాకల్యముగా వారి శిష్యులైన మంచిరాజు శ్రీనివాసమూర్తి గారి ద్వారా గ్రహించిరి. వీరిని వారి గురువులతో సమానంగా పూజిస్తు బరంపురం పట్టణం వీరిని తరచుగా రప్పిస్తూ జ్ఞాన యజ్ఞముల ద్వార ఒరిస్సా ప్రాంత మందు కూడా నిజ సాంప్రాదాయక భోధనా పద్ధతిని ప్రచారం చేయుటలో ప్రముఖ పాత్ర వహించుచున్నారు. ఒక భక్త మండలి ఏర్పాటై రోజు వారి కృషి సాంప్రాదాయ పద్ధతికి అను బందంగా జరిపించు కొంటున్నారు. ఇది అందరు ఆదర్శముగా తీసుకొని పాటించి ప్రోత్సహించ వలసిన అంశము. గురు ఋణము తీర్చుకొనే పద్ధతిలో సేవాపద్ధతిగా ఈ గ్రంధం పునర్ ముద్రనకు వలయు ఆర్థిక సంపత్తి సమకూర్చి దన్యులైరి. శ్రీ గురుమూర్తి అనుగ్రహం వారి ఎడల సర్వదా ప్రసరించి ఆశయ సిద్ధి గాంచగలరు గాక.

ఇట్లు
శ్రీ అరుగొండ విశ్వనాధం

## మనవి

శ్రీ రామచంద్రరావుగారి రచనలలో వ్యాసమంజరి 3 భాగములు, గురుస్తోత్రం 2 భాగములు, పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరో భూషణము 2 భాగములు, పునర్ ముద్రణకై ఎదురుచూచుచున్నవి. వలయు ఆర్థిక సంపత్తి వదాన్యుల ప్రోత్సాహమునకై ఎదురుచూచుచున్నవి. కావున ఆసక్తి కలవారు ఈ కమిటితో సంప్రదించగలందులకు కోరుచున్నాము.

ఇట్లు
భక్త మండలి



ఓం
శ్రీ గురుభ్యోనమః

01 శ్లో॥ భ్రమేణాహం భ్రమేణత్వం భ్రమేణోపాసకాజనః
భ్రమేణీశ్వర భావత్వం భ్రమమూల మిదం జగత్ ॥

తాత్పర్యము - వాచ్యార్థము :

నేను, నీవు భక్తులైన జీవులు, ఈశ్వరుడు, జగత్తు యివన్నియు భ్రాంతిచే కల్పించబడినవే. భ్రమయే మొత్తము విశ్వమున కంతయు మూలకారణముగా నున్నది.

లక్ష్యార్థము :

పరమాత్మ ప్రత్యగాత్మలు : జీవేశ్వరులు; యీ సమస్త విశ్వము యివన్నియు భ్రాంతి కల్పితములే. జగత్తే సర్వ భ్రాంతులకు మూలము.

విశేష వివరణలు :

1. భ్రమ 2. అహం 3.త్వం 4. ఈశ్వరభావం 5.భ్రమమూల మిదం జగత్

1. భ్రమ : అనగా భ్రాంతి; మిద్యామతి, ఒక దానిని చూచి వేరొకటిగా తలంచుట యదార్థ జ్ఞానము ప్రమయనియు అయదార్థ జ్ఞానము (మిద్యాజ్ఞానమనియు) భ్రమ యనియు చెప్పబడును. సర్వ భ్రమలకు లేక భ్రాంతులకు మూలకారణమేదియో ముందు విమర్శించవలెను. ఆ వస్తువు సత్యమా, అసత్యమా; ఆ వస్తువు సత్యమైతే అందు అసత్య వస్తువులు యొట్లు భ్రాంతిచే కల్పించబడును; కల్పింపబడజాలవు. కారణమేమనగా, పరమ సత్యమైన వస్తువు లనేకములుండజాలవు. ఒక్కటి మాత్రమే పరమ సత్యమై యుండును. ఒక్కటియే యుండును గనుక, అప్పుడు భ్రాంతి గలిగించుటకు మరొక వస్తువే యుండదు. త్రాడు పాము అను రెండు ఉంటేనే ఒక దానిని జూచి రెండవదని భ్రాంతి కలుగును. కనుక, భ్రాంతి కారణమైన వస్తువు కూడ అసత్య వస్తువు మాత్రమేయై ఉండవలెను. కాబట్టి, కారణ రూపమైన ఆ అసత్యవస్తువు వలన కార్యరూపమై ఏర్పడిన వస్తువులు అన్నియు భ్రాంతిరూపములే. కార్య కారణములు కానిది పరిపూర్ణ పరబ్రహ్మ మొక్కటి తప్ప మిగిలిన దృశ్యాదృశ్య విశ్వము, విశ్వ కారణము రెండున్ను భ్రాంతిరూపములే, యనిచెప్పి తీరవలసినదే. విశ్వము నంతటికి అత్యంత మూలకారణ వస్తువు సచ్చిదానంద లక్షణములు గల బ్రహ్మమేనని సర్వశాస్త్రములు ముక్త కంఠముతో చెప్పుచున్నవి. ఆ జగత్కారణ వస్తువునకు మూలం అనగా కారణం లేదు, సత్యమైన పరిపూర్ణ పరబ్రహ్మము దేనికి కారణము కాజాలదు. ఎఱుకకు కారణముగా ఉండుటకు, మరొక వస్తువు లేదు. కనుక, దానిని శివరామ దీక్షితులవారు

మూలం లేని గుర్తెరిగే శరీరం అని పేరెట్టి, సర్వభ్రాంతులకు మూలం మూలంలేని గుర్తెరిగే శరీరమని సిద్ధాంతీకరించినారు. పరిపూర్ణ మొక్కటియే సత్య వస్తువు గనుక గుర్తెరిగే శరీరం అసత్యమే, భ్రాంతియే ఉన్నట్టు తోచబడుటయే గాని నిజంగా లేనేలేదు. సత్యమైన పరిపూర్ణమునకు లేని యెరుకకు యేలాటి సంబంధము ఉండజాలదు గదా!

యీ జగత్కారణవస్తువైన యెరుకయే భ్రాంతియని తెలుసుకున్నాము. యీ యెరుకయే బ్రహ్మమని అపోహపడి దానికి పరిపూర్ణ పరబ్రహ్మముయొక్క లక్షణములు అంటగట్టి అంతకంటె వేరే సత్య వస్తువు లేదని మతస్తులు గజిబిజి పడినారు.

అయితే యీ యెరుకనే వస్తువు భ్రాంతియే యైతే, ఆ భ్రాంతి యెవరికి కలిగినది? ఎట్లు కలిగినది? ఎప్పుడు ఎందుకు కలిగినది? యిత్యాదిప్రశ్నలు అనేకములు కలుగుట సహజమే. యిట్టి ప్రశ్నలన్నిటికి గొడ్డలి పెట్టుగా శ్రీ శివరామ దీక్షితుల వారు పలికిన సిద్ధాంత వాక్యమేదనగా, యెరుక పరిపూర్ణ బ్రహ్మమందు పుట్టనే లేదని, పరిపూర్ణ బ్రహ్మమందు, దానికి బీజము (మూలం) గాని, స్థానం గాని లేనేలేదని ఉత్తమాధికారుల కొఱకు యుద్ఘాటించినారు. అయితే, యెట్లు ఉన్నట్టు గాన వస్తున్నది? సర్వ భ్రాంతులకు మూలకారణ మెట్లయినది? అని ప్రశ్నించే మధ్యమాధికారుల కొఱకు యెరుక తనయందే తాను తోచినది ఎట్లనగా, అది రెండు రీతులుగా అనగా స్థూల సూక్ష్మములుగా ఉండి స్థూలము నుండి సూక్ష్మము, సూక్ష్మమున కావరణముగా స్థూలము యేర్పడుచు, తనకు తానే స్వకారణమై యున్నదని తన యందలి సూక్ష్మముగా నున్న తెలివియే అనేకము కావలెనని సంకల్పించి, అనేక ఉపాధులుగా మారి వానియందు జీవ రూపముగా తానే ఉండి తన్ను చూచుకొని తానే సత్యమని తన వలన నైన జగత్తు అసత్యమని భ్రాంతి జెందుచున్నదని, కనుక యిట్టి యెరుకయే సర్వ భ్రాంతులకు మూలకారణమై యున్నదని చెప్పబడు చున్నది. అయితే ఎఱుక కేవలము అలీక పదార్థమా! అని ప్రశ్నిస్తే, ఉత్తమాధికారి దృష్టిలో నిశ్చయంగా అలీక పదార్థమే. పరిపూర్ణ పరబ్రహ్మము తప్ప రెండోది యేమియు లేనేలేదు. నరస్వప్నముకున్న ఆధార అధిష్ఠానములైన యీ ఎఱుకకు లేవు గనుక యిది సురస్వప్నము వంటిదనియే శ్రీ శివరామ దీక్షితుల వారి నిర్ణయం. జన్మ పరంపరలకు మూలకారణ మీ యెరుకే గనుక యీ యెరుక రహితమునందే జన్మ రహితమని సిద్ధాంతము.

జగత్తు మిథ్యయని అద్వైత సిద్ధాంతము గదా, అది మాయా కార్యమని అంటారు. మరియూ, మాయ జడమనీ చేతన బ్రహ్మముయొక్క సత్తా మాత్రము చేతనే ప్రవర్తించుననీ, మాయకు బ్రహ్మమే స్థానమనీ, అంతటా వ్యాప్తమైయున్నది చేతన బ్రహ్మమేననీ వారంటారు గదా! యీ మాయ బ్రహ్మలకు భేదము చెపితే అద్వైత హాని యగును గదా! మాయను బ్రహ్మశక్తి యని యంటే, శక్తికి, శక్తునికి భేదముండరాదు గదా! యీ విధంగా చర్చిస్తే చేతన బ్రహ్మకు జగత్కారణమనిశ్రుతి యుక్తి, అనుభవములచే సిద్ధించు చున్నది. జగత్తు మిథ్యయైతే

జగత్కారణ వస్తువు కూడా మిధ్యగాక తప్పదు. ఏలనన, సత్య వస్తువు నుండి మిధ్య వస్తువు యేరీతిగాను కలుగజాలదు. భ్రాంతిచే కలిగినదంటే (అప్పుడింకా సృష్టి కాలేదు) బ్రహ్మమే తన్ను తానే చూచుకొని భ్రాంతి జెందెనని చెప్పవలసి యుండును. అప్పుడు భ్రమలకు లోనయ్యే దానిని బ్రహ్మ మన దగునా? గనుక భ్రమకు మూలము భ్రాంతియేనని చెప్పక తప్పదు.

2. అహం అనగా నేను యని శబ్దార్ధము. నేను యను శబ్దమునకు తాదాత్మ్య సంబంధంచే స్థూల, సూక్ష్మ, కారణ మహాకారణ శరీరము లన్నియు లక్షింపబడుచున్నవి. 'అహం బ్రహ్మాస్మి' అను మహావాక్యములో అహం అను మాటకు ప్రత్యగాత్మనే అర్ధముగా గ్రహించవలసియున్నది. భగవద్గీత విభూతి యోగములో, అంతా పరమాత్మ స్వరూపంగా అభివర్ణింపబడుటలో, అహం శబ్దమే ప్రయోగింపబడినది. ఉదాహరణకు

శ్లో॥ అహమాత్మగుడా కేశ। సర్వ భూతాశయ స్థిత :
అహమాదిశ్చ మద్యంచ । భూతనా మంతమేవచ ॥

సర్వ భూతముల (ప్రాణుల) హృదయములందు నేనే ఆత్మగ నున్నాను నేనే అన్ని ప్రాణులయొక్క ఉత్పత్తిస్థితి నాశములకు, కారణ స్వరూపుడనై యున్నాను.

గనుక, పరమాత్మ ప్రత్యగాత్మలు, స్థూల, సూక్ష్మకారణ శరీరములు అన్నియు భ్రమ స్వరూపములే యని 'భ్రమేణాహం' అని శ్లోకములో చెప్పబడినది.

3. 'భ్రమేణత్వం' : నీవూ భ్రమ స్వరూపుడవే నని సామాన్యార్ధం కాని, 'త్వం' శబ్దమునకు వాచ్యార్ధముచే జీవుడున్నూ లక్ష్యార్ధముచే ప్రత్యగాత్మయున్నూ, తత్వమసి మహావాక్యములోని "త్వం" శబ్దమునకు అర్ధములుగా గ్రహింపబడినవి గనుక, యీ శ్లోకమున త్వం పదమునకు ప్రత్యగాత్మనే అర్ధముగా గ్రహించవలెను.

4. 'భ్రమేణోపాస కాజనః' ఉపాసకులైన భక్తులందరు గూడా భ్రమ స్వరూపులే. 84 లక్షల జీవోపాధులలో మానవోపాధియే కర్మ భక్తి జ్ఞానాది సాధనలచే కృషి జేసి మోక్షము జెందుటకు యోగ్యమైన ఉపాధియై యున్నది. గనుక, ఉపాసకులగు మానవులందరూ గూడా భ్రమ స్వరూపులే నని ప్రత్యేకించి చెప్పబడినప్పటికీ సర్వజీవోపాధులు గూడా భ్రమ స్వరూపులేనని యర్ధం గ్రహించవలెను.

5. 'భ్రమేణీశ్వర భావత్వం' : అనగా యీశ్వరుడున్నాడని భావించుట కూడా భ్రమయే, మాయోపహిత చైతన్యమే యీశ్వరుడని శాస్త్రములు చెప్పుచున్నవి. మాయా, మాయాధిష్టాన చైతన్యం, మాయా ప్రతిబింబం,యీమూడు కలసి యీశ్వరుడు అని ప్రతిబింబవాదులచే చెప్పబడినది ఎట్లు చెప్పినను మాయ అనేది యీశ్వరుని ఆస్తిక్యతకు ప్రధానాంగమై యున్నది

"యామాస్రామాయా" అనగా యేది లేనిదో అది మాయయని యొక నిర్వచనముగదా! గనుక, అట్టిమాయతో గూడుకున్న యీశ్వరుడు సత్యస్వరూపుడు యెట్లగును. గనుక యీశ్వరుడనే భావము భ్రమయని చెప్పబడినది. పురుషుని సన్నిధానమున ప్రకృతి జీవజగత్తులుగా పరిణమించుననని సాంఖ్యము చెప్పుచున్నది. యిందు యీశ్వరునికి స్థానము లేదు, గనుక, అది నిరీశ్వర సాంఖ్యమని పేరొందినది. అంతే గాకుండా, జీవులకు సృష్టి స్థితిలయములు యెట్లు గలుగుచున్నవి. అంటే, 'ఏకో దేవ స్త్రిథాబిన్నః బ్రహ్మావిష్ణు మహేశ్వరః' ' అనిన్నీ, 'గురుస్సత్వమయో విష్ణుః రాజ సశ్చతురానన । తామసోరుద్ర రూపేణ సృజత్యవతి హంతిచ॥ అనిన్నీ చెప్పబడుచున్నది, అనగా ఒకే దేవుడు బ్రహ్మ విష్ణు యీశ్వరుల రూపములతో సృష్టిస్థితిలయములు చేయుచున్నాడని భావము. కాని పంచమ వేదముగా ప్రసిద్ధి కెక్కిన భారతములో

కం॥ కర్మమున బుట్టు జంతువు
కర్మముననను వృద్ధి బొందు, కర్మమున జెడున్,
కర్మముజనులకు దైవము,
కర్మము సుఖ దుఃఖములకు కారణ మధిపా॥

అని చెప్పబడినది. అంటే జీవుల సృష్టి స్థితి లయములు, జీవితమున ననుభవించు ఖేద మోదములు, వారి కర్మానుసారము జరుగుచున్నవి గనుక, యీశ్వరుడుండవలసిన పనిలేదు, గనుక కర్మమే జనులకు దైవమని యన్నారు. గనుక, కర్మమునకే యీశ్వరుడని పేరు వొచ్చి యుండవచ్చును. రాజులేని రాష్ట్రముండునా, గనుక, యీ సమస్త విశ్వమునకు రాజుండవలదా? అనే దృష్టితో యీశ్వరభావమేర్పడి యుండవచ్చును. గనుక యీ శ్లోకములో భ్రమేణీశ్వర భావత్వమని యీశ్వరుడున్నూ భ్రమరూపుడే యని చెప్పబడినది.

'భ్రమ మూలం ఇదం జగత్' అనగా యీజగత్తు భ్రమయే మూలంగా గలది (లేక) జగత్తుకు మూలం భ్రమయే యని యర్థము. జగుత్తు మిథ్య యని అద్వైతులూ అంటూనే యున్నారు. కనుక క్షణక్షణము మారిపోతూ సృష్టి స్థితిలయములకులోబడిన జగత్తు సత్యము కాజాలదు గనుక. యిది భ్రమయే.

ప్రకారాంతరముగా జగత్తే భ్రమకు మూలంగా ఉన్నది యని యర్థము కూడా యీ మాటలకు చెప్పవచ్చును. ఎట్లనగా, 'జాయతేతి, గచ్ఛతీతి' అనగా. పుట్టేది పొయ్యేది యేదో అదే జగత్తని నిర్వచింపబడినది.

దృశ్యా దృశ్య ప్రపంచములో, సర్వమునకు ఉత్పత్తి నాశనము లున్నట్లు మనం గమనించు చున్నాము గదా! గనుక, సర్వము జగత్తే, జగత్తు కానిదేది? పంచతన్మాత్రల అన్యోన్య మిశ్రమముతో యేర్పడిన పంచభూతములతో యీ ప్రపంచము .లేక జగత్తు

యేర్పడినదని సాధారణ అభిప్రాయము. కాని పంచభూతములు యెట్లు వచ్చినవి. అత్మయే పంచభూతములుగా పరిణామము చెందినది. పరిపూర్ణ పరబ్రహ్మమునందు స్థానంలేనిది లేదుగనుకనూ యిది జ్ఞాన స్వరూపమైయున్నది, గనుకనూ యిది లేనియెరుక యని మూలంలేని గుర్తెరిగే శరీరమని పేర్లుపొందినది. మరియెట్లు వొచ్చినదని యంటే ఉన్నట్లు తోచుట మాత్రమే గనుక యిది భ్రాంతియని, వొట్టి భ్రమయని పరిపూర్ణ బోధచేత యీ భ్రాంతి రహితమగునని చెప్పబడినది, ఈ భ్రాంతియొక్క రాకపోకలేగాని నిజంగా యెరుక పుట్టనే లేదని సిద్ధాంతం. ఈ యెరుకయే భ్రమగనుక సకల భ్రమలకు మూలం మూలం లేని ఈ గుర్తెరిగే శరీరమే, "(యెరుకే యని యన్నారు. శ్రీ శివరామదీక్షితుల వారు) ఈ దృష్టిలో" భ్రమ మూలం ఇదంజగత్, పుట్టి చచ్చేది, రాకపోకలు సలిపే యెరుకయే యని యర్థం చెప్పిననూ చెప్పవచ్చును.

యీ శ్లోక భావమునే కృష్ణదేశికేంద్రులవారు తమ కందార్థ కంద పద్యములలో

కం॥ భ్రమ యనిన పుట్టుకనినను
భ్రమకే నామంబు లిట్టి భ్రమనే నీవున్,
భ్రమ యీమేను జగత్తులు
భ్రమ ఎరుకయు మరుపు రెండు భ్రమే భ్రమ వినరా ॥

యని చెప్పినారు అంటే నేను నీవు, మేను-జగత్తు, ఎఱుక మరి-పుట్టుక, అనగా ఎరుక పుట్టినదనుకొనుట, యివి భ్రమయే యన్నారు.

ఒక్క పరిపూర్ణ బ్రహ్మము తప్ప మిగతా దంతయు కార్య కారణ రూపంగా నున్న ఎరుకయే. అది అంతయు భ్రాంతియే. భ్రమ మూలం, జగత్తనగా జగత్తు తోచుటకు భ్రాంతియే కారణమని వాచ్యార్థము అంగీకరంచినప్పటికీ గుర్తించే తెలివి వున్నంతవరకు భ్రాంతులన్నియూ తీసి వేసిన కొద్దీ మొలుస్తూనే వుంటవి. ఆ గుర్తించే తెలివి పరిపూర్ణ పరబ్రహ్మమునందు లేకనే తోచినది. గనుక, అదే తొలి భ్రాంతి. ఆ తొలి భ్రాంతి రహితమునందు తప్ప సర్వ భ్రాంతి రహితము కాదు. 'భ్రాంతి, రహిత మిదం మోక్షం' ఆ మాట అప్పుడు గాని సార్థకం కాదు, యిట్టి పరిపూర్ణ బోధను అశ్రయించిన వారి కందరికీ ప్రసాదించి కృతార్థులను గావించి సద్గురు మూర్తి దివ్యశ్రీ చరణములను అహరహము సేవించుచుందుము గాక.

2 2. శ్లో॥ త్యజ ధర్మమధర్మంచ ఉభే సత్యానృతేత్యజ
వుభే సత్యానృతే త్యక్త్వా, యేనత్యజసి, తత్యజ ॥

తాత్పర్యము : ధర్మా ధర్మములను, సత్యా సత్యములను వదలివేయుము, దేనిచేత వానిని వదలివేసితివో దానిని కూడా వదలివేయుము లేక, త్యజించుమని యీ శ్లోకభావము.

ఈ శ్లోకము త్యజ "అనగా త్యాగము చేయుము అని హితోపదేశము చేయుచున్నది. సాధారణముగా త్యాగము అను మాటకు దానము చేయుట లేక ఉచితముగా యిచ్చి వేయుట అని అర్థము, యజ్ఞ, దాన, తపస్సులనునవి మానవునకు విహిత కర్మలుగా నిర్ణయింపబడినవి. వీని ఫలితముగా మానవుని అంతఃకరణమునందు శుభ సంస్కారము లేర్పడును మరిన్ని అదృష్టమగు పుణ్యఫల విశేషముత్పత్తియై, అందువల్ల వుత్తమ జన్మలుకల్గి అందు సర్వ సుఖములు అనుభవించగలదు, అవి యెంతటి గొప్ప సుఖ భోగములైనను "సుఖానంతరం దుఃఖం" అనే సూత్రానుసారంగా దుఃఖాంతములయ్యే యుండును. ప్రకాశవంతమగు దీపమున్నచో దాని క్రీనీడ సహితము వుండక తప్పదు గదా! ఒకేనాణమునకుండు బొమ్మ, బొరుసుల వంటివే ఈ సుఖదుఃఖములు గూడ సుఖ దుఃఖములు కావడికుండల వంటివని చెప్పబడుచున్నవి. దాన ధర్మములవల్ల కల్గు స్వర్గాది పుణ్యలోకములలోని సుఖభోగములు పరిమితములున్ను అశాశ్వతములున్నూ అయివున్నవి. ఏలయనగా సుఖానుభవముచే పుణ్యము వ్యయమైపోగా "క్షీణేపుణ్యే మర్త్యలోకం విశంతి" అనేగీతా వచనానుసారం, భూలోకంలో (చావుపుట్టుకలు గల లోకములో) జనన మరణ రూప సంసార చక్రములో పరిభ్రమించుట మాత్రం తప్పదు. ఇహలోక సుఖమునకై ప్రాకులాడుట యెంత అవివేకమో స్వర్గాది పుణ్యలోకముల యందలి సుఖ భోగము లాసించి అందుకు సాధనముగా దానధర్మాదులొనర్చుటయు అంతటి యవివేకమే, కనుకనే "ఇహమూత్రార్థ ఫల భోగ విరాగము" కూడా ఒక అధికారి లక్షణముగా వేదాంత శాస్త్రము పేర్కొన్నది. కనుక జన్మరాహిత్య మాసించిన వుత్తమాధికారియొక్క కర్తవ్యమేమో ఈ శ్లోకము బోధించుచున్నది.

ధన కనక వస్తు వాహనములు గాని, గృహరామక్షేత్రాదులుగాని, దశ దానములు, షోడశ దానములు, యింకా యితర దానములుగాని, జన్మరహితమును కలిగింపజాలవు. పుత్ర, మిత్ర, కళత్రములను, ఆస్తిపాస్తులను, యిహలోక సంబంధములగు సర్వభోగ భాగ్యములను, వాసనాత్రయ, ఈషణ త్రయాదులను, త్యాగముచేసి, సన్యాసాశ్రమమును స్వీకరించినను, జిహ్వచాపల్యమును విడచి ఆకులలములు, కందమూలములతో మాత్రము, ఆకలి దప్పులను బాపుకొనుచున్నను, కేవలం వాయుభక్షణతో ప్రాణము నిలబెట్టుకొనుచున్నను, జనన మరణ భ్రాంతి రహితస్థితి చేకూరజాలదు సర్వ జిద్యాగమను యజ్ఞము చేసి తన సర్వస్వము దానముచేసినను ప్రయోజనము లేదు. కట్టు బట్టలను సహితము విసర్జించి, దిగంబరిగా నుండినను భ్రాంతి రహితస్థితి చేకూరజాలదు కనుకనే "నకర్మణా నప్రజయా, ధనేన, త్యాగేనైకే అమృతత్వ మానశుః" అను శ్రుతివాక్యమునందు త్యాగమువలన తప్ప, మరి ఒకదానివలన అనగా కర్మలవలనగాని, సంతానం వలనగాని, ధనముచేతగాని మరే యితరవిదంగాగాని, శాశ్వతమగు అమృతత్వం (చావులేకపోవుట) సిద్ధించదు. అని భావము. చావులేనిచో జన్మయు లేదని గ్రహించవలెను. ఏలననగా - పుట్టినది చావక తప్పదు.

పుట్టుటయు తప్పదు అని సిద్ధాంతము. 'జాతస్య హి ధ్రువో మృత్యుర్ధ్రువం జన్మమృతస్యచ అని గీతావచనంగదా! ఐతే పైనుదహరించిన శ్రుతియందు త్యాగమొక్కదానివల్లనే అమృతత్వం సిద్ధించునని చెప్పబడినదేగాని, ఆ త్యాగమేదో వివరింపబడలేదు. భగవద్గీతాచరమ శ్లోకమంలో "సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణం వ్రజ" అని,నిగూఢంగా చెప్పబడినది. సర్వ ధర్మములను పరిత్యజించి నన్ను శరణుపొందుమని భగవానుడంటున్నాడు. "శరణంవ్రజ" శరణుపొందుమని అర్థం. ఈ శరణాగతి లక్షణమును భాష్య కారులు పూర్తిగా వివరించలేదు. ఈ శరణాగతి లక్షణమను, రహస్యమును ఒక్క పరిపూర్ణ భావజ్ఞులే పూర్తిగా వివరించుచున్నారు. ఆ రహస్యము యీ వ్యాసాదిని పేర్కొన్న "త్యజ ధర్మా మధర్మంచ" అను భ్రాంతిరహిత శ్లోకమే పూర్తిగా వివరించుచున్నది ధర్మాధర్మములు, సత్యానృతములు మొదలగు సర్వద్వంద్వములను విడచినపిదప, దేనిచే ఆ సర్వద్వంద్వములను విడచెనో ఆవస్తువు శేషించి యుండును. అట్లు శేషించిన యేకవస్తువును కూడా వదలివేయుటయే, త్యాగమునకు పరా కాష్ఠ, ఏలననగా, యిచ్చుట, పుచ్చుకొనుట అను రెండు క్రియలు ప్రాణేంద్రియమున కున్నట్లే, త్యాగముచేయు శక్తి గలదానికి ప్రతిగ్రహించు శక్తి కూడా వుండియే యుండుక తప్పదు. కనుక ఆ వస్తువు శేషించియున్నచో మరల గ్రహించు ప్రవృత్తికిలోబడు ప్రమాదముండును. కనుక త్యాగము దేనిచే చేయబడినదో ఆ వస్తువును కూడా త్యాగము చేయుము (ఏనత్యజసిత్రత్యజ) అని యీ భ్రాంతి శ్లోకముద్ఘాటించు చున్నది.

త్యాగశబ్దమునకు, వదలిపెట్టుట, వుచితముగా యిచ్చివేయుట అను రెండర్థములున్నవి. సాకారము, భౌతికము అగు రూపముగల వస్తువైతేనే చేతితో యిచ్చి వేయవచ్చును. కాని ధర్మాధర్మములు సత్యానృతములు, భాతిసిద్ధపదార్థములేగాని భౌతికమగు అస్తి సిద్ధపదార్థములుగావు కనుక చేతితో యిచ్చునవికావు, కనుక ధర్మాధర్మములు, సత్యానృతములు, వీని స్వరూప స్వభావము లెట్టివో ముందుగా వివరించి తెలుసుకొనవలసి వున్నది.

ధర్మాధర్మములు :- ధర్మశబ్దమునకు "ధార్యతే యితి ధర్మః" అనే నిర్వచనానుసారం ఏదిధరించి భరించునో అది ధర్మము సృష్టిస్థితిలయము లన్నిటికీ అత్యంత మూలకారణమైనది పరమాత్మ (కారణబ్రహ్మము). స్థితి అనగా సృష్టించబడిన సమస్తమును పోషించుచూ కాపాడుటయే; వాని వాని నిర్ణయానుసారముగా అవి నశించు పర్యంతము వానినాస్తి తియందుంచుటయే, యీ శక్తి సర్వశక్తి వంతుడగు పరమాత్మకే కలదు కనుక పరమాత్మయే ధర్మశబ్దవాచ్యుడు. మరియు యేయే నియమములకు లోబడి యీ విశ్వము నడచుచున్నదో అవి అన్నియు ధర్మములే. అధర్మములకు లోబడియే పరమాత్మ విశ్వమును పాలించును. అధర్మమునకు గ్లాని సంభవించి నపుడెల్ల అతడు అవతరించి, ధర్మసంస్థాపనము చేయుచుండును. కనుక మానవులు యేదిధర్మమో, యేదధర్మమో, గుర్తెరిగి నడువవలసి యున్నది. అట్లు యెందుకు ధర్మపద్ధతిగా నడుపవలెనంటె "ఆత్మనో మోక్షార్థం జగద్ధితా

యచ" అనగా తనయొక్క మోక్షముకొరకున్ను లోకహితార్థమున్ను అని చెప్పబడినది. "ధర్మోరక్షతి రక్షితః" ధర్మాచరణతో ధర్మమును రక్షించినచో ధర్మమాతని రక్షించును. ధృతి, క్షమ, దమము, అస్తేయము, శౌచము, యింద్రియనిగ్రహము, ధీ, విద్య, సత్యము, అక్రోధము యీ పదిన్ని ధర్మలక్షణములుగా చెప్పబడినవి. మానవులందరు యీ ధర్మలక్షణములతో జీవించుట విహితధర్మమై యున్నది, యీ ధర్మలక్షణములకు విరుద్ధములైన లక్షణములతో జీవించుట అధర్మము. అధర్మమును వదలివేయుట ధర్మమే యగును కానీ ధర్మాధర్మముల రెంటినీ వదిలి వేయమని యీ శ్లోకముద్ఘాటించుచున్నదే! ధర్మమును, గూడ వదలవేయమని చెప్పుట యెంత విరుద్ధము? అను సంశయము కలుగక తప్పదు కనుక యీ విషయము అవశ్యము వివరించి తెలుసుకొనదగినదే.

ధర్మాచరణమువలన అంతఃకరణ పరిశుద్ధి కాగలదు అట్టి పరిశుద్ధాంతః కరణమే, జ్ఞాన బీజము నాటుకొని జ్ఞాన వృక్షము, పెంపొంది, పుష్పించి, ఫలించుటకు వుత్తమ క్షేత్రము అట్టి పరిశుద్ధాంతఃకరణము గలవాడే గురూపదేశము గొనుటకు వుత్తమాధికారి, ఉత్తమాధికారి లక్ష్యము, కేవలం జనన మరణ భ్రాంతి రహితమే, ఈ లక్ష్యసిద్ధికి పరిపూర్ణ బోధయందు నిష్ణాతుడై గురూపదిష్ట మార్గమందు పయనించుటే యేకైక మార్గము. ఈ పరిపూర్ణభావ మాశ్రయించిన సూరిజనులకు యీ శ్లోకము కర్తవ్యోపదేశముగావించుచున్నది.

పరిపూర్ణ పరబ్రహ్మమును, లేని యెరుకను, గురుకృపచే వస్తు నిశ్చయంగా తెలుసుకొని లేని, యెరుకను విడిచిపెట్టి యుండుటే పరిపూర్ణ బోధ సిద్ధాంతము. సకల భ్రాంతులకు మూలం, మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే యని యీ పరిపూర్ణ బోధ సిద్ధాంత నిర్ధారకులగు శ్రీ శివరామ దీక్షితుల వారి ప్రవచనము.

మూలంలేని గుర్తెరిగే శరీరమే లేనెరుక యని సుప్రసిద్ధమే. ఇదియే సర్వజీవోపాదుల యందూ సూత్రాత్మగా నుండి వ్యష్టి సమిష్టులయందు సర్వమును గుర్తెరిగే తెలివి రూపంగా నున్నది. జీవోపాధులయందు నిజ స్వరూపమును మరచి, బేధ దృష్టికిన్ని, సకల భ్రాంతులకున్ని మూల కారణముగానున్నది. దీనికి పరిపూర్ణ పరబ్రహ్మమునందు మూలంగాని, పుట్టుకగాని, స్థానంగాని లేనేలేదు. తనకు తానే కారణము మూలమూనై వున్నది. మరియు తన రూపములను తానే చూచుకొని తనకు వేరైనవిగా వానిని చూచుకొనుచూ కొన్నిటియందు రాగమూ, కొన్నిటియందు ద్వేషమూ పెంచు కొనుచూ, తానల్లుకొన్న పట్టుకాయలో తానే చిక్కి బంధింపబడిన పట్టుపురుగువలె జీవేశ్వరజగత్తుఅనే తన ఆవరణ యందే తాను బంధింపబడి జనన మరణములయందు పరిభ్రమించుచున్నది. తన నిజరూపమును తాను గ్రహించి యీ బంధమునుండి విడవబడి తననిజస్వరూపమను మోక్ష స్థానమును చేరుకొన్నా మరల మరల మరుపు రూపము చెంది పునః పునః బంధమున చిక్కుచునేయున్నది. తానున్నంతవరకు తనకీబంధమోక్షములు తప్పవు. శాశ్వత జనన మరణ రహితం కానేరదు.

తనయొక్క రహితమునందు గాక జనన మరణ రూప సంసార బాధ తప్పదు కనుక యీ లేనెరుకను (పరిపూర్ణ పరబ్రహ్మమందు లేనేలేదు కనుక దీనిని లేనెరుక యన్నారు) లేకుండా చేయుటయే పరిపూర్ణ బోధలక్ష్యము.

ఇది ధర్మము, యిది అధర్మము అని నిర్ణయించుటకు, ఆ ధర్మా ధర్మములయందు ప్రవర్తింప చేయుటకు, గుర్తెరిగే శరీరమే మూలకారణమై యున్నది. ఏలననగా గుర్తెరుగకుండా యవరున్నూ యే కర్మయూ చేయరు. ధర్మాధర్మ నిర్ణయము చేయునది యీ గుర్తెరిగే శరీరమే (అనగా యెరుకయే) ధర్మా ధర్మములను విడవుమన్నారంటే, ధర్మాధర్మముల నిర్ణయించి ధర్మములను గుర్తెరిగి యాచరించుటయు, మరొకట ధర్మమని మానుటయు యెరుక క్రియలే గావున (యెరుకనే) గుర్తెరిగే శరీరమునే విడువుమని ఆదేశించినట్లే, ధర్మమనగా ఆత్మ అని అర్థమున్నట్లు గుర్తించితిమి గదా! యీ అర్థములో, అధర్మమనగా అనాత్మయని అర్థము స్వీకరించవలసి యున్నది. అపుడు ఆత్మానాత్మలను (యెరుక మరుపులను) వదలి వేయవలెనని చెప్పినట్లే అగును.

సత్యాసత్యములను గూడా విడచి వేయుమని శ్లోకములోనే చెప్పబడినది. సత్యమను శబ్దమునకు ఆత్మయనియు, జగత్తు అనృతము (అసత్యము) మిథ్య, అనియు చెప్పబడుచున్నది. ధర్మాధర్మములు, సత్యానృతములు, అట్లే సమస్త సాపేక్షిక ద్వంద్వములు యెరుకయే గాని, అందేదియూ పరిపూర్ణ బ్రహ్మము కానేరదు పరిపూర్ణ బ్రహ్మము నిరపేక్షక నిర్ద్వందము. ఏకానేకములు గానిది, ఏమనీ నోటితో అనరానిది.

పై వివరణవల్ల విడువ వలసినది (త్యజించవలసినది) యేదియో తేటతెల్లమైనది. దేనిచేత విడువలెను? యే'సత్యజసి, తత్యజ' అని శ్లోకములో చెప్పబడినది. గనుక యెరుకయగు దేనిచేత విడువవలెను? ఎరుక కాని దొక్క పరిపూర్ణమే అది కేవలం నిష్క్రియము దానిని ఒక పనిముట్టుగా చేసి దానితో యెరుకను విడుచుట అసాధ్యముగదా! పరిపూర్ణబోధచే పరిపూర్ణ యెరుకలను తెలిసి, యెరుకలేనిదేయని దృఢం చేసుకున్న మీదట ఆ యెరుకే బ్రహ్మమనే తన పూర్వభావమును, భ్రాంతిని పూర్తిగా వదిలివేయుటయే యెరుకను విడచుట, ఇదంతయు భావనా రూపమే కనుక, "యెరుక చేతనేపట్టి తీసివేయరా" అని శ్రీకృష్ణ దేసికేంద్రులవారున్ను సెలవిచ్చి యున్నారు. విడిచేవాడు, విడువబడేది, విడిచే పనిముట్టు (సాధనము) మూడూ యెరుకే. ఇది జ్ఞాతృ, జ్ఞేయ, జ్ఞానములనే త్రిపుటి. ఈ త్రిపుటిని విడచుటే పరిపూర్ణ బోధకుల లక్ష్యము. గమ్యము, యీ త్రిపుటి రహితమునందే సర్వభ్రాంతి రహితము. శాశ్వత జనన మరణ రహితము నాన్యః పంథాయనాయ" (మరొక మార్గము లేదు).

3. శ్లో॥ గురుణా వరణ త్యాగః అనావరణము త్తమం
పరిపూర్ణం పూర్ణమేవ పూర్ణాచల సముద్రవత్॥

తాత్పర్యము : గురుకృపచేత ఆవరణమును వదలవలెను. అపుడు ఆవరణ రహితమై పరిపూర్ణ పరబ్రహ్మమే, నిస్తరంగ మహాసముద్రమువలె నిండి నిబిడీకృతమై ఒకేరీతిగా నిశ్చలమై స్వతస్సిద్ధమై యుండును.

ఆవరణ నిరావరణములను యించుక విచారించి తెలిసి కొనవలసియున్నది. ఆవరణమనగా, ఆవరించునది, కప్పునది లేక మాయునది, బంధించునది అని అర్థములున్నవి. "ఆ బ్రహ్మ స్తంభ పర్యంతం" (తృణము మొదలుకొని బ్రహ్మము వరకు) గల సమస్త పదార్థములును, పిపీలికాది బ్రహ్మ పర్యంతంగల జీవోపాదులున్ను ఆవరణము కల్గియే యున్నవి. వేయేల? రూపము గల సమస్తమునకు ఆవరణమున్నది సృష్టి కారణమగు బ్రహ్మము నిరాకారము గదా, దానికి ఆవరణములేదని యనుకొనరాదు. కారణ కార్యములకు సమాన ధర్మములుండక తప్పదు, నిరాకారమగు బ్రహ్మమే సాకారమగును, నిరాకారముగను మార్పులు చెందుచున్నది. కనుకనే ఆత్మకు సర్వాకారమే ఆకారముగా చెప్పబడినది, మేఘములు వేసవి కాలమునందున్నవా లేవా? లేవన్నచో తొలకరించుటతోనే యెట్లు వచ్చుచున్నవి? నేత్రగోచరముగాక నిరాకారమైయుండి వాతావరణమందలి శీతవాయు సంస్పర్శ వల్ల సాంద్రత చెంది స్థూలాకృతిలో నేత్రగోచర మగుచున్నవి. అట్లే సృష్టి కాలమువరకు సూక్ష్మాతి సూక్ష్మమైయున్న కారణ బ్రహ్మము స్థూల పరిణామములలో ఆకాశాది పంచభూతములై బ్రహ్మాండ పిండాండములై ఆవిర్భవించి రూప నామములు చెందుచున్నవి. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అంతా ఆకారణబ్రహ్మమేకదా! యిక సృష్టియేమి? అని శంకిస్తే, నిజంగా సృష్టి ప్రళయములులేవు ఆ బ్రహ్మము యొక్క ఆవిర్భావ తిరోభావములు మాత్రమే, నామరూపాలు మాత్రమే సృష్టి ప్రళయములు చెందుచున్నవి కనుక, సాకార నిరాకారములు రెండునూ ఒకే వస్తువుయొక్క రెండురూపములు మాత్రమే అందుచే కారణబ్రహ్మమునకున్ను ఆవరణ మున్నదనియే చెప్పితీరవలసియుంది. యీ బ్రహ్మము ఆవరణముకలిగియున్ననూ స్థూల దృష్టికి గోచరించుటలేదు. సూక్ష్మదృష్టిచే విచారించిన వారికి మాత్రము అది ఆవరణ కల్గినదేనని తెలియబడుచున్నది. నామరూపాత్మకమగు విశ్వముగా మార్పు చెందక పూర్వం ఈ కారణబ్రహ్మమూ తెలియబడుటలేదు. దాని ఆవరణమూ తెలిబడుటలేదు. రెండునూ సూక్ష్మములే విశ్వముగా మారిన పిదపనే విశ్వమునకు కారణ వస్తువును గూడా మనము అన్వేషించి తెలిసికొనగోరుచున్నాము కార్య లక్షణములు కారణమునందు వుండక తప్పదు. ఒక నారింజపండు యొక్క విత్తనము ఆ పండుయందే యున్నట్లు విశ్వకారణము విశ్వమునందే అంతర్నిహితమైయున్నది, కార్యరూపముగా విశ్వము స్థూలము, దానియందు సూక్ష్మముగ విశ్వాకారమున్నది ఐతే విశ్వము లేనపుడు అనగా అవిర్భావం చెందనపుడు దాని కారణవస్తువు లేదా యేమి? వున్నది అది విశ్వమున్నపుడు లేనపుడు కూడా వున్నది. విశ్వమున్నపుడు విశ్వముగానూ విశ్వాతీతముగానూయున్నది. కార్యమునకు పూర్వము కారణముండునుగదా! మహాసముద్రమునందొక భాగముమాత్రమే మంచుగా గడ్డకట్టినట్లు,

కారణ బ్రహ్మమునందొక భాగమే విశ్వరూపము వహించును, "పాదోస్య విశ్వభూతాని త్రిపాదస్యామృతందివి" అని శ్రుతియున్నూ చెప్పుచున్నది. ఆ బ్రహ్మమునందొక భాగమే విశ్వమైనదని విగతా మూడుభాగములూ దివ్యమూ, అమృతమూ,అయియున్నదిని భావము.

ఇట్లే ప్రపంచమందలి సమస్త వస్తువుల యందు స్థూల సూక్ష్మములు, కారణకార్యము లుంటూనే వున్నవి. యిందు స్థూలము మాత్రమే యింద్రియగోచరము. సూక్ష్మము మనోగోచరము. చివరికొక చిళ్ళ పెంకును వుదాహరణగైకొన్నను అందు గుణరూపముగానో శక్తి రూపంగానో లేక కేవలం సద్రూపంగానో, దాని అత్యంత మూలకారణమగు ఆత్మ వస్తువుండియే వున్నది. అత్యంత మూలకారణమగు పరమాత్మ స్వరూపము కూడా యీ న్యాయమునకు లోబడియే యున్నది. దానియందు కూడా స్థూలసూక్ష్మము లున్నవి. సూక్ష్మరూపము పురుషుడు స్థూలరూపము ప్రకృతి యిదిపురుషుని కావరణ రూపమైయున్నది. జీవోపాధులకు అవిద్యావరణము, యీశ్వరునికి విద్యా (లేక మాయా) వరణము, పరమాత్మకు ప్రకృత్యావరణము వున్నవి. బ్రహ్మాండమునకు పిండాండ మొకచిన్న నమూనా మాత్రమే "యదేవేహతదముత్ర, యదముత్ర తదన్విహ" అని యీవిషయమునే శ్రుతి యుద్ఘాటించుచున్నది. ఏది అక్కడున్నదో అది యిక్కడనూ వున్నది. ఏది యిక్కడున్నదో అది అక్కడనూవున్నది అని భావము. కనుక సృష్టికారణమగు పరమాత్మకు కూడ అవరణమున్నది అని తెలినది. ఇపుడు గురునిచే యే అవరణము తొలగించుకొనవలసి వున్నది? దేహి కావరణమై దేహమాయె "దేహమనగా స్థూలసూక్ష్మకారణ శరీరములు మూడున్నూ అయివున్న వేకాని ఒక్క స్థూలదేహము కాదు. యిది మరుపురూపము. ఎరుకకు మరుపే అవరణము పిండాండ, బ్రహ్మాండ అధిష్టాన స్థానముల మూడింటియందు కూడ. మరవు అవరణ రూపంగా వుంటూనే వున్నది. అధిష్టాన స్థానమందు ఆవరణ రూపంగానున్న మరుపే, మిగతా అన్ని ఆవరణలకు కారణమైయున్నది. యిదియే యితరులు చెప్పే మూలజ్ఞానమైయున్నది. దీనిరహితము నందుగాక జన్మరహితము కానేరదు. కనుక గురుకృపచేత యీ మూలావరణమే తొలగిపోయినచో, దొంతరలో నున్న కుండలలో క్రిందకుండ తొలగించినచో దొంతరయంతయు కూలిపోవునట్లు, సమస్తావరణములూ విడచిపోగలవు. ధర్మాధర్మములను సత్యానృతములను దేనిచేత విడచితిమో ఆతెలివిని (ఎరుకను) వదలివేసినచో యీ శ్లోకములో చెవ్పబడిన ఆవరణను కూడా గురుకృపచేత్యజించినట్లగును. వానికి జన్మరహితము కాక తప్పదు. ఎరుక దాని ఆవరణము యీ రెండూ కలసి ఒక్కటిగా నుండి ఒకటిపోతే రెండు పోవుననుట సత్యం, ఐనా, రెండూవిడువవలెననుట సంపూర్ణ సంశయనివృత్తి కొరకు మాత్రమే, ఆవరణ నివారణము లెట్టివో శ్రీభాగవతుల కృష్ణదేశి కేంద్రులు తమకందార్థగ్రంధములో "అవరణము అకసము, నిరావరణము అచలమనుచు అనిరి మహాత్ముల్" అనే కందార్థంలో శెలవిచ్చియున్నారు.

అకసము అనగా అకాశము, అవకాశరూపము, చతుర్దశ లోకములకు, త్రిమూర్తులకు ముక్కోటి దేవతలకు, నవగ్రహములకు, నక్షత్రములకు, బ్రహ్మాండ పిండాండములకు

సమస్తమునకు చోటిచ్చుచున్నది. యిదియే దేశము. సమస్తమునకు స్థానమూ ఆధారమూ అయివుండి లోపలా వెలుపలానిండి యున్నది. కర్మజ్ఞానముల వ్యవహారమంతయు దీనియందే జరుగుచున్నది. సృష్టియే కానపుడు యిదిశుద్ధాకాశమని చెప్పబడుచున్నది.

ఏపేరుతో యే ఆకాశమని పేరుపెట్టినా నామరూపాలతోవున్నా ఆకాశము వస్తుత: ఒకే ఆకాశమైయున్నది. ఈ ఆకాశముకంటికి కానరాక యున్నప్పటికి యింద్రియరూపమగు మనస్సుచే దీనిని గుర్తింపగలుగు చున్నాము. మరియు శబ్దతరంగములు దీనియందు వ్యాపించి వానిద్వారా శబ్దము, మనకర్ణపుటములచేరుచున్నది. అపుడు శబ్దముచేత గూడ, శబ్దమున కావరణమగు దీనిని గుర్తించుచున్నాము. ఆవిధముగా శ్రవణేంద్రియము, దీని వునికిని మనకు తెలియచేయుచున్నది. యింద్రియ గోచరమగునది స్థూలము. ఆకాశము నందు, గుణ రూపముగా, శబ్ధము సూక్ష్మమైయున్నది. ఆత్మనుంచివచ్చిన యీ ఆకాశమునకు ఆత్మకారణమున్ను సూక్ష్మమున్ను అయివున్నది. "ఆకాశ శ్శరీరం బ్రహ్మ" యని శ్రుతి ఆత్మకు ఆకాశమే శరీరమని చెప్పుచున్నది. అంటే ఆత్మదేహి: ఆకాశము దేహము అన్నమాట మనయందుండే ప్రత్యగాత్మకు, పంచకోశములు ఆవరణముగానున్నట్లే పంచభూతములు పరమాత్మకు ఆవరణముగా నున్నవి. అందు ప్రథమ భూతమైన ఆకాశమే ఆత్మకు మొదటి ఆవరణము, తీపిని బెల్లమునుండి వేరుచేయలేక పోయినట్లే, ఆకాశమును ఆత్మనుండి వేరుపరచలేము. అవి రెండూ అవినాభావ సంబంధము కల్గినవై స్థూలముగా విడదీయరానివై యున్నవి. ఐనను నాలుకపై వైచుకున్నప్పుడు తీపిని గుర్తింప గలుగుచున్నాము. అట్లే ఆత్మను అనుభవములో ఆకాశము నుండి వేరుచేసి చిల్లక్షణము చే గుర్తించగలుగుచున్నాము. ఐతే యిది విమర్శనాత్మకముగ సిద్ధించు పరోక్షజ్ఞానమే, ధ్యానపద్ధతిలో, ధ్యానముచేయు మనస్సు, ధ్యేయమైన ఆత్మ తాదాత్మ్యము పొందినపుడే అది ఆత్మయొక్క అపరోక్ష జ్ఞానము కాగలదు.

ఆకాశము ఆత్మకు శరీరముగా నున్నదని తెలిసికొంటిమి ఆత్మ చిత్స్వరూపము (జ్ఞానరూపము లేదా ఎరుక రూపము:) ఆకాశము జడ రూపము (అజ్ఞాన రూపము: లేదా మరుపురూపము) ఇంద్రియములద్వారా, జ్ఞానరూపమైన ఆత్మ అజ్ఞాన రూపమైన తన దేహమును గుర్తించినపుడు, ఆ దేహము జ్ఞేయ మగుచున్నది. జ్ఞాతృ, జ్ఞాన జ్ఞేయములు మూడున్ను ఒకే త్రిపుటి యిందొకటి లేనిచో మిగతారెండున్నూ వుండజాలవు. "దేహమును జూచుకన్నులు దేహమునకు వేరుగానట్లే జ్ఞాన జ్ఞేయములు రెండూ వేరుగావు. జ్ఞానమే బ్రహ్మము అని కొందరూ, కాదు జ్ఞేయమే బ్రహ్మ మని కొందరు యితరులంటున్నారు. "జ్ఞానేన జ్ఞేయ మాలోక్య పశ్చాత్ జ్ఞానం పరిత్యజేత్" అని వుత్తరగీత చెప్పుచున్నది, అనగా జ్ఞానము చేత ఎరుగబడిన జ్ఞేయ బ్రహ్మమును గుర్తెరిగి పిదప జ్ఞానమును విడిచివేయుమని ఆదేశించుచున్నది, విడచివేయదగినది అసత్యము, అనిత్యము అయివున్నపుడే అది పరిత్యజింపదగినదై యుండును. అట్టి అసత్య వస్తువుచే సత్య వస్తువును గుర్తెరుగుట సాధ్యమా? కాదు, రెండూ సత్యములో లేక రెండు అసత్యములో కావలసి వుండును.

శశిశృంగముచే శత్రు సంహారము చేయసాధ్యమగునా? జ్ఞానమును విడచితే దాని కావరణమగు జ్ఞేయము శేషించుట, దీపమార్పివేసిన పిదప దాని వెలుగు నిలచియుండుననుటయే గదా! పోనీ, రెండూ వుండగానే అందు సత్యమైన జ్ఞేయమును సత్యముగా భావించుచూ అసత్యమైన జ్ఞానమును అసత్యమని భావనామాత్రముగా నిరసించుట మాత్రమే, "త్యజించుట" అను మాటకు అర్థముగా స్వీకరించితే, సత్యాసత్యములు రెండూ సత్యములుగాను నిత్యముగాను వుండవలెను, రెండు పరమసత్య పదార్థములకు వునికి చెప్పరాదుగదా!

ఇక అనావరణము లేక నిరావరణమును గూర్చి యించుక వివరించి తెలసికొందము, ఆవరణమునకు పెద్దచిన్న తారతమ్యములుండగలవు. పరిమితి వుండగలదు. హద్దులు వుండగలవు. ఆవరణేలేనిచో పెద్దచిన్న అనుతారతమ్యముగాని, హద్దులుగాని, పరిమితిగాని వుండజాలవు కనుక అనావరణమైనది అపరిమితము, అనంతము కాకతప్పదు. మరియు ఆవరణ మున్న దానికి ఆదిమధ్యాంతములు చెప్పవచ్చునుగాని ఆవరణరహితమైన నిరావరణముకు ఆద్యంతములు చెప్పరాదు! అట్లే మధ్యభాగమున్ను వుండదు. అనంతమగు నిరావరణమునందెన్ని ఆవరణలుగల వస్తువులైన యిమిడి యున్నట్లు తోచబడుచున్నవి.

ఆవరింపబడినవస్తువు ఆయావరణమందే వునికికల్గి ఆవరణతోపాటు పుట్టిచచ్చు చుండును. ఆవరణను విడచి అదివుండదు. దానిని విడచి దాని ఆవరణ యుండదు. నిరావరణమనునది వస్తువేగాదు. అది వస్తుమత్రహితము ద్రవ్యగుణ, కర్మసామాన్య విశేష సమవాయ, అభావములను వస్తులక్షణము లేవిన్ను దానికి లేవు. యీసప్తవిధ ధర్మములు, ఆవరణగల వస్తువునకే యుండును. భావాభావములున్నూ వుండును గనుక అది అనిత్యము అసత్యము అనియే చెప్పకతప్పదు. వైశేషికలు ఆత్మను కూడ నవద్రవ్యములలో ఒకటిగా చేర్చినారు. ద్రవ్యలక్షణము గల వస్తువునకు చిన్నదో పెద్దదో ఒక ఆవరణవుండును. దాని యందే ఆకాశముండును గనుక దాని ఆవరణయందే అనగా దేశము (లేకప్రదేశము) నందే వస్తువు చలించుచుండును, ఆయావరణదాటితే నీటినివిడచినచేప బైటపడి నశించినట్లే నశించితీరును. కనుకనే అది ఏకదేశీయము.

నిరావరణమగు వస్తువు సర్వత్రనిండి నిబిడీకృతమై సూదిమోపుటకైనా సందులేక ఏకరీతిగా అనంతముగా యున్నది గనుక దానిలోపలగాని బైటగాని దేశమేలేనందువలన అది యెన్నడుచలింపజాలదు కనుకనే దానిని అచలపరిపూర్ణమని వ్యవహారార్థము పేరుపెట్టుట జరిగినది. నామరూప క్రియనట నాదులు గల్గిన చిన్న వస్తువులన్నియు మహాకాశమని పేరుగల ఎరుకయొక్క మహావరణమందే తోచుచున్నవి. నిరావరణమైన అచల పరిపూర్ణము యీ మహాకాశమునకు చోటిచ్చుటయే లేదు, గాని చోటిచ్చినట్లును ఆమహాకాశములో విశ్వమంతయు సృష్టిస్థితిలయాదులు పొందుచున్నట్లు ఎరుకకు భ్రాంతిచే తోచుచున్నది. కనుకనే శ్రీకృష్ణ దేశికేంద్రులవారు "ఎరుకను కలలో, పురుషునికే యీ

విశ్వమగుచు నేర్పడు కలగా" అని శెలవిచ్చినారు. ఆవరణము కల్గిన యెరుకతనయందే తాను భ్రమించుచున్నది. పరిపూర్ణమందు నిజంగా యెరుకపుట్టనే లేదు కనుక ఎవరికితోచినది? ఎవరికి భ్రాంతి కల్గినది? ఏమీలేదు కనుక ఆవరణమేలేదు. అథవాఅయావరణం వున్నట్లు తోచబడినచోట నున్నదినిజంగా నిరావరణమే, (అట్లుతోచబడిన) ఆవరణము ననే నిరావరణమునుచూచి ఆవరణమెడలీన అవలిమాట లేదని కనుక్కోరా" అని శ్రీకృష్ణదేశకులు శెలవిచ్చినారు. కనుక పైరీతిగా గురుముఖతః అరూథ పరచుకొనుటే మనకర్తవ్యం.

"అనావరణ ముత్తమం" అని యీభ్రాంతి రహిత శ్లోకముద్ఘాటించుచున్నది. అనావరణమన్నా నిరావరణమన్నా ఒక్కటే, వుత్తమం, అంటే ఒకటి కంటె యెక్కువ వున్నపుడే మిగాతావానికంటే యొకానొకటి వుత్తమం అని చెప్పవలెను. ఉన్నది ఒక్కపరిపూర్ణ పరబ్రహ్మమే మరేదీ లేదన్నపుడు ఉత్తమం అనే శబ్దానికాయర్థము స్వీకరించరాదు. వుత్తమం అనే శబ్దానికి తమస్సును దాటినది అను అర్థము కలదు. తమస్సు అనగా చీకటి, చీకటి సర్వభ్రాంతులకు కారణమ్మైయున్నది. ఆవరణమున్నా సకల భ్రాంతులకు నాలవాలమ్మైయున్నది. అనావరణమునందు భ్రాంతి కారణములేదుగురుకృపచే ఆవరణమును త్యజించినవారికి, అనావరణమగుపరిపూర్ణము, మాత్రమే కలదని మహాసముద్రము (నిస్తరంగమైన సముద్రము) వలె స్వతసిద్ధమై నిల్చి యుండును. ఆవరణమున్నంతవరకు భ్రాంతి రహితము కాదు అని యా శ్లోకముద్ఘాటించు చున్నది.

4 4. శ్లో॥ అబీజం, వృక్ష సంపన్నం, శాఖా పల్లవ వర్జితం
పుష్పంనాస్తి, ఫలంనాస్తి, నంపూర్ణం వృక్ష వర్జితం॥

**తాత్పర్యము** : విత్తనంలేని మహావృక్ష మరికొమ్మలు చిగుళ్ళు, పూవులు పండ్లు యేమియు దానికి లేవు. ఆ మహావృక్షము దేనియందు లేదో అది సత్యమైనది, నిత్యమైనది పరిపూర్ణమై యున్నది.

ఇట్టి శ్లోకమే యొకటి, ఒక పొడుపు కధగా ప్రచారములో నున్నది.

శ్లో॥ అబీజం వృక్ష సంపన్నం శాఖా పల్లవ వర్జితం,
పుష్పం నాస్తి, ఫలం నాస్తి కోవృక్షం పండితోత్తమః

విత్తనంగాని, కొమ్మలు, చిగుళ్ళు పూవులు కాయలు గాని యేమియు లేని యొక మహావృక్షమున్నది. అది యేదో చెప్పు చూద్దాం. అని ప్రశ్న దానికి పుట్టకొక్కు అనో పుట్ట గొడుగనో సాధారణంగా జవాబు చెపుతారు. కాని యిది సరిఅయిన జవాబు కానేరదు. వృక్షసంపన్నం అనుటలో ఆ వృక్షము నిండుగా పెరిగి చూడముచ్చటగా నున్నది అని అర్థము వచ్చుచున్న దేగాని కుక్క గొడుగువంటి దెట్లు కాగలదు?

బీజము లేని వృక్ష మెందైన నుండునా? వుండజాలదని మన విజ్ఞాన దృష్టికి కానవచ్చును. ఐతే పాచి తీగ, అంతర తామర అనువానిని బీజము లేనివానికి దృష్టాంతరములుగా యిస్తున్నారు. పాచి తీగకు బదనిక, అని మరియొక పేరు కూడా వున్నది, పాచితీగకు యిది మొదలు, యిది చివర అని చెప్పలేము. దానికి భూమితో సంబంధము కానరాదు కాని మరొక చెట్టు బెరడు మధ్య చేరినపృద్వి రేణువులయందు అది పుట్టవచ్చును. దాని విత్తనము సూక్ష్మాతి సూక్ష్మముగా నుండుటచే మన స్థూలదృష్టికి గోచరించక పోవచ్చును. అంతమాత్రమున బీజం లేనేలేదని అనరాదు. అట్లే అంతర తామర చెరువులు మొదలగు వానియందు చాలాకాలము నిలవ వుండిన నీటిలో బైలుదేరును, కుక్కగొడుగు (లేక పుట్టకొక్కు) అనునది కూడ మలిన పదార్థములే మూలముగా గల్గియున్నది. అంతేగాని వాన్కి (విత్తనం) కారణము లేదని చెప్పరాదు. కార్యముంటే కారణముండి తీరవలెనని, అన్వయ పద్ధతి చేతను, కారణంలేని కార్యముండదు అని అన్వయ వ్యతిరేక పద్ధతి చేతను, చెప్పవచ్చును.

ప్రతి వస్తువున్ను స్థూల సూక్ష్మములుగా యుంటున్నది. అందుసూక్ష్మభాగము సులభ గ్రాహ్యముగాదుగాని దాని స్థూలభాగమునందే అగోచరమై వుంటూవుండును. సూక్ష్మభాగమును దాని స్థూలభాగ మావరించి సూక్ష్మమును మరుగు పరిచియుండును విజ్ఞానదృష్టితో యోచించిన వార్కి, స్థూలము కార్యరూపముగాను, సూక్ష్మము కారణముగాను గానవచ్చును ఐతే కారణరూపమైన సూక్ష్మమునందు స్థూలముగా పరిణమించు స్వభావము యిమిడియే యుండును. అట్లే స్థూలమునందు దాని సూక్ష్మము గర్భీకృతమయ్యే యుండును. కనుక స్థూల సూక్ష్మములు ఒకదాని నొకటి యెడబాసి యుండజాలవు. కనుకనే కారణ కార్యములకు భిన్నత్వము లేదని, అవి కలసియే వచ్చునని కలసియే పోవునని చెప్పవలసి యున్నది, స్థూల సూక్ష్మములు రెండునూ కలసియే వస్తువు యీ విషయమునకు శ్రీకృష్ణదేశి కేంద్రులు గుడమధురములను దృష్టాంత మిచ్చుచు "గుడమే మధురము, మధురమె గుడము ఆ గుడమధురములను గొనకొని తొలుతన్ బొడమిన దేదన, సరిగా పొడమింది; ఒకటేగ రెండు పోయినట్టేగదరా! తను వెరుకలిట్టె నట్టెగదా!" అంటూ కందార్థమును వ్రాసినారు. తనను వెరుకలులో దేహికి ఆవరణముగానూ స్థూలముగాను దేహమున్నది. దేహమునందు దేహి సూక్ష్మముగాను తెలివి రూపంగానూ యున్నది.

ఏ వృక్షమును గూర్చి యీ శ్లోకముటంకించుచున్నది అవృక్షమునకు బీజమేది? క్షేత్ర మేది? విశ్వమే యొక వృక్షముగా అభివర్ణింప బడినది ఋగ్వేదమునందు "బ్రహ్మసవనం, బ్రహ్మవృక్షమాసీత్, యతో ద్యావా పృథ్వీ నిష్టతక్షుః" అనగా బ్రహ్మవనమందలి బ్రహ్మయను వృక్షముయొక్క కర్రతోనే యీ పృధ్వీఆకాశములు చెక్కబడినవి అని అర్థము. అనగా బ్రహ్మమే విశ్వమునకుపాదానకారణము అన్నమాట బ్రహ్మమే బీజముగాగల యీజగద్వృక్షమునే సంసార వృక్షమనియునూ వర్ణింపబడినది. "తస్మా ద్వాఏతస్మా దాత్మనః ఆకాశస్సంభూతః

ఆకాశాద్వాయః వాయోరగ్నిః అగ్నే రాపః, అద్భ్యః పృధివీ, పృధివ్యాభ్యాం ఓషధః ఓషధీః భ్యోన్నః అన్నత్పురుషః" అని తైత్తిరీయ శ్రుతి సృష్టిక్రమమును వర్ణించినది. బ్రహ్మము బీజము, బ్రహ్మాండము వృక్షము, నవగ్రహ నక్షత్రాదులే కాండశాఖ పల్లవ పుష్పాదులు యెనుబది నాలుగు లక్షల జీవోపాధులున్ను యీ వృక్షము నందే కాచిన ఫలములు, జీవోపాధుల జనన మరణరూప సంసారమంతయు యీమహావృక్షము నందే జరిగిపోవు చుండుటచే యీ జగద్వృక్షమే సంసార వృక్షముగా అభివర్ణింపబడినది, దీనికినిమిత్తోపాదాన కారణములు, క్షేత్ర బీజములు అన్నియు ఆ బ్రహ్మమే కనుకనే "సర్వం ఖల్విదం బ్రహ్మం' ' అన్నారు.

"బీజంమాం సర్వ భూతానాం విద్ధి పార్ధసనాతనం" అనగా సనాతనుడగు నన్ను 'సకల భూతములకును మూలకారణునిగ తెలుసుకొమ్మంటున్నాడు గీతలో భగవానుడు, కనుక సకలభూతములకు అనగా సర్వసృష్టికి బీజ స్వరూపుడన్న మాట మరి సంసార వృక్షమునకు మూలం లేదనుటయెట్లు?

దేని నుండి మరియొకటి పుట్టునో దానికి పుట్టుక యుండి తీరవలెనని సిద్ధాంతం. పుట్టుక గలదే పుట్టించగలదు కార్య కారణ సంబంధములో కారణమునకు మరియొక కారణముండి తీరవలె ఈ కారణకార్య పరంపర అనంతముగా సాగవలసినదే అంటే పిల్లకు తల్లివుంటే, ఆ తల్లికి తల్లి మరల ఆ తల్లికి తల్లి వుండి తీరాలికదా! కనుకనే కృష్ణ దేశికేంద్రులు "తన మూలము తల్లిదండ్రులు, తనవలెనే వారు వారి తల్లితండ్రులకున్, తనవలెనెగాని అన్యముగన జననస్థాన మొకటి గలదన తరమా; బ్రహ్మాదులకది తెలియ తరమా?" అంటూ కందార్థం వ్రాసినారు. తృణాది బ్రహ్మపర్యంతము కార్యకారణములను చెప్పుకుంటూ పోవచ్చును, గాని ఆ బ్రహ్మకు కారణము గానరాదు కనుక దానికి మూలము లేదన్నారు. మూలము లేనివస్తువు సత్యమెట్లగును? సత్యమైన దానికిన్ని కారణమున్నొగాదు, మరొకదానికి కార్యమున్ను కాజాలదు కేవల సత్య వస్తువు కార్యకారణములు కతీతమై సర్వలక్షణ విలక్షణమై యున్నది అదియే పరిపూర్ణ పరబ్రహ్మము. కనుక "అబీజం" అనగా బీజము లేనిది ఏది? అన్నిటికి బీజస్వరూపమైన బ్రహ్మమునకు బీజము లేదని తేలినది. కనుక ఆ బ్రహ్మము సత్యవస్తువు కాజాలదు. కారణము అసత్యమైతే దాని నుంచి కార్యరూపంలో పరిణమించిన సంసారవృక్షము సత్యమెట్లగును? కార్యరూపమగు సంసారవృక్షమునగానవచ్చు తరుకాండ శాఖ ఫలపుష్పాదులన్నియు మిధ్యయే నన్నమాట. "మృగజలము అగుపించినను మిధ్యం చెరిగిన మాడ్కి" సంసార వృక్షమంతయు మిధ్యగా నెరుగవలయును.

పరస్పర భేదమున్నపుడే నానాత్వము గోచరించును. నానాత్వము గోచరించిపుడే పరస్పర భేదము గోచరించును. వస్తువులు అన్నియు ఏకదేశీయములేగనుక యీ సంసార

వృక్షము సకల దేశములయందు ఏకకాలమున నిండియున్న పరిపూర్ణవస్తువు కాజాలదు బీజవృక్షములు రెండున్నూ ఏక దేశస్థములే కావలసివచ్చును. అథవా, బీజరూపమైన బ్రహ్మ వస్తువు సంపూర్ణ మని యెవరైన అనుటకు సాహసించినచో స్వగతభేద మంగీకరించ వలసి యుండును. ఏక నేకములుగానూ ద్వంద్వస్వరూపముగా నున్నదనిన్ని చెప్పవలసివుండును. ఇట్టి బ్రహ్మమును, బీజమనిన్ని, లేక తల్లివేరనిన్ని వర్ణించిననూ, వృక్షమునందు బీజమూ, బీజమునందు వృక్షమునూ గర్భీకృతములయ్యే యుండును. కనుక బీజరూపమైన బ్రహ్మ వస్తువుతో సహా విశ్వమంతటిని సంసారవృక్షముగా పేర్కొనవలసివున్నది మూలంలేని యీగుర్తెరిగే శరీరము సంసారమన్నారు శ్రీ శివరామ దీక్షితులవారు.

ఇట్టి సంసార వృక్షముయొక్క సృష్టిస్థితిలయములకు తావివ్వక కారణ కార్యములుగాక చలించక నిండి నిబిడీ కృతమైయున్న దేదో అదే పరిపూర్ణబ్రహ్మము. "కించిన్నాస్తి" సంసార మూలకారణమైన జ్ఞానం పుట్టనేలేదు.

5 5. శ్లో॥ సర్వశూన్య మయం రూపం, జన్మశూన్యం స్వభావతః ।
జన్మ భావేనమృత్యుశ్చ పరిపూర్ణం స్వభావతః ॥

తాత్పర్యము : ఈ రూపము అంతయు పూర్తిగా లేనిదే అయివున్నది స్వభావముచేతనే పుట్టుక లేనిది. జన్మభావన, మృత్యుభావనకు మూలమగుచున్నది. పరిపూర్ణ పరబ్రహ్మమొకటే స్వతస్సిద్ధమైన సత్యమై యున్నది.

ఈ శ్లోకములో, శూన్య వస్తువైన లేనెరుకయును పూర్ణత్వము గల పరిపూర్ణ పరబ్రహ్మమును సూత్ర ప్రాయముగా సూచింపబడినవి. సర్వ శూన్యమయం-రూపం (సర్వశూన్యం + అయం రూపం) ఈ రూపము సర్వ శూన్యమైనది అని అర్థము రూపమనగా నేమి? శబ్దార్థ మాత్రంచేత నేత్ర గోచరమగునది రూపమని తెలియవచ్చును. రంగులు మాత్రమేగాక, లావు, సన్నము, పొడుగు, పొట్టి మొదలగు సర్వాకారములున్నూ కంటికి గానవచ్చుచున్నది. కాని నేత్రము ద్వారా చూచునది మనస్సు కనుక రూపమును గుర్తించునది నిజముగా మనస్సు కాని నేత్రం కాదనిన్ని తెలియగలము. మనస్సు, రూపమునే గాక శబ్దస్పర్శ, రూప, రస, గంధములనే పంచతన్మాత్ర విషయములను జ్ఞానేంద్రియములద్వారా గుర్తెరుగు చున్నది అంతేకాక యీ పంచతన్మాత్రలుగా పరిణామము చెంది, వానికి మూలకారణమై, సృష్టికి పూర్వం వానిని తనయందు బీజరూపంగా గర్భీకృత మొనర్చుకొన్న పరమాత్మయొక్క స్థాన, స్వరూప, స్వభావములను కూడా తెలుసుకొనుచున్నది. అందుకే "మనసైవాను ద్రష్టవ్యం, మనసైవాను శ్రోతవ్యం" అని శ్రుతియు ప్రవర్తిల్లినది కనుక రూపమను శబ్దమునకు సంపూర్ణార్థము చెప్పవలెనన్నచో మనస్సుచే గ్రహించగల్గిన సమస్తమూ రూపమే యని చెప్ప వలసియున్నది. రూపమంటూ వుంటే (అది నేత్రగోచరమైనా కాకున్న) భాషలో దానికొక శబ్ద రూపమగు నామమున్నూ యేర్పడుట సహజము, నామరూపములు రెండూ మిథ్య యని సర్వులూ అంగీకరించిన విషయమే.

సృష్టి కారణమగు పరమాత్మతో సహా సృష్టి యందలి సమస్తము నామ రూపాత్మకమైయున్నది. సర్వమునకు ఆ పరమాత్మయే పరిణామోపాదన కారణముగా నున్నది గనుక, కారణత్వేనా సర్వమూ పరమాత్మయేగాని, నిజముగా అన్యమేమియు లేదు. యీ విషయమునే "యద్యత్పశ్యతి చక్షుభ్యాం తత్తదత్మేతి నిశ్చయా యద్యచ్ఛృణోతి కర్ణాభ్యాం తత్తదాత్మేతి నిశ్చయా XXX అంటూ, యింద్రియ గోచరమగు పంచతన్మాత్ర విషయములూ, శుద్ధ మనస్సునకు గోచరమగు ఆత్మయు సర్వమూ ఆత్మయే యని శ్రుతి యుద్ఘాటించు చున్నది. కనుకనే" శ్రీ గురోః పరమం రూపం వివేకం చక్షుర గ్రతః XXX" అంటుంది గురుగీత గొప్పదైన ఆపరమాత్మ స్వరూపము కంటి గ్రుడ్డుకు అగ్ర భాగముననే అనగా అంటియే వివేకులైన వారికి గానవచ్చుచున్నది కనుకనే ఈ శ్లోకములో ఆ యాత్మ స్వరూపము "అయం' అనగా 'యీ' అని అత్యంత సామీప్య స్థితిలోనే వుండి యున్నట్లుగా నిర్దేశింపబడినది. సాక్షాత్కార వాక్యం అయిన "అయమాత్మ బ్రహ్మ" అనే మాండూక్యోప నిషధ్ధంతర మహా వాక్యమందు కూడా నిర్దేశింపబడి యున్నది.

మహావాక్యార్థ లక్ష్య భూతమగు యీ పరమాత్మ స్వరూపమును, ఈ శ్లోకము సర్వశూన్యమను శబ్దముచే నిరసించుచున్నది, సర్వశూన్యమనగా నేమి? అది మధ్యాంతముల యందు, అంతర్బహిస్సులయందు, కాలత్రయములయందు, ఎచ్చటనూ ఎప్పుడునూ గూడ, కొంచమైన లేదు అన్నమాట. వివేకులైన విద్వాంసులకూ చక్షురగ్ర భాగమందే గానవచ్చు. యీ భూమాపదార్థము యించుకైనా లేనేలేదా ! లేనేలేదని యీశ్లోకముద్ఘాటించుచున్న దేమి?శూన్యమనగా నేమో, శూన్యమేదోయదెట్లు శూన్యమో వివరించి తెలిసికొందము.

శూన్యమనగా ఏమియు లేకపోవుట. ఐతే తనయందేమియు లేకపోవుటయా? లేక, తానే లేకపోవుటయా? శూన్యగృహమంటే, గృహముండి గృహమునందెవరూ లేరని యర్థము చెప్పుచున్నదిగదా !గృహమే లేదని అర్థము చెప్పము గదా ! అట్లే యిచ్చటగూడ తానుండి తనయందు యితర మేమియూ లేదని అర్థము చెప్పవలెనని నిర్ణయించరాదు. తానుంటే తనయందు స్వగత భేదములన్నియు నుండి తీరును ఏలయనగా, సర్వావయవములతో గూడియే శరీరమగును. శరీరముండి అవయవము లేనివగునా? అయితే అవయవ నిర్మాణము యింకనూ కానిస్తితి యొకటి, అవయవ నిర్మాణమైన స్తితి యొకటి, అని స్తితి భేదము మాత్రముండ వచ్చును; అంతమాత్రమున నిరవయవ స్తితి పూర్ణమని, సావయవస్తితిలోని అవయవములు మాత్రం శూన్యమని చెప్పరాదు. అంతేగాక సర్వశూన్యమనే శబ్ద ప్రయోగము యీవాదమును పరాస్తమొనర్చుచున్నది.

సర్వము తానైన వస్తువునకు రూపము లేదనుటయెట్లు? ఒకపుడు నిరాకారముగానూ మరొకపుడు సాకారముగానూ, ఒకపుడు నిరవయవముగానూ ఒకపుడు సావయవముగానూ, ఒక వస్తువే మారుచున్నపుడు దానిని కేవల నిరాకారమూ, నిరయవమూ, అరూపమూ,

అనరాదు. సర్వాకారములు దానిఆకారములే సర్వ వర్ణములూ దాని వర్ణములే, దాని రూపములే కనుకనే సర్వశూన్యం అయంరూపం అని శ్లోకములో చెప్పబడినది. కనుక ఏ వస్తువుయొక్క రూపములన్నియూ శూన్యములో, ఆ వస్తువే శూన్యం అని చెప్పి తీరవలసినదే. ఆ వస్తువు పరమాత్మయే.

ప్రకారాంతరముగా విచారించుచో - ప్రపంచమునందే వస్తువులు విమర్శించి చూచినా, దానికి కారణ పరంపర కానవస్తూ, చివరకు అత్యంతమూలకారణము పరమాత్మయందు పర్యవసించుట వలన ఆపరమాత్మయే పరమకారణముగా శేషించుచున్నది. కనుక పరమాత్మ కూడా కారణ కార్యపరంపరలో చేరిపోవుచున్నది. కార్యము కారణమును, ఆకారణము కార్యమగుచు దానికి మరొక కారణమును ఆపేక్షించుట, కార్యకారణ సూత్రముయొక్క ధర్మమై యున్నది కాని సర్వకారణమైన పరమాత్మకు మరొక కారణ వస్తువు కానరాదు. దానిక మూలం లేదు మూలంలేని వస్తువునకు వునికి చెప్పరాదు. పరమాత్మ 'స్వయంభు' దానికి మూలమన్వేషింపరాదు అని కొందరంటారు. కాని కారణ వస్తువును స్వయంభుః అన రాదు. కార్య కారణములు యెన్నడూ కానట్టి, ఒక పరిపూర్ణ పరబ్రహ్మ ము మాత్రమే స్వతసిద్ధమగు వస్తువు. యెరుకైన పరమాత్మ యెన్నడూ ఎక్కడా లేనేలేదు, సర్వ పరిపూర్ణముగా సూదిమోపుటకైననూ చోటులేని పరిపూర్ణ బ్రహ్మ మందు కారణ బ్రహ్మమగు పరమాత్మకు తావులేదు. "తన మూలము తల్లిదండ్రులు, తన వలెనే వారు వారి తల్లిదండ్రులకున్ తన వలెనేగాని యన్యముగన జనన స్థానమొకటి గలదన తరమా?" అని శ్రీకృష్ణ దేశికేంద్రులు శెలవిచ్చి యున్నారు. తనకు మూలము తండ్రి; ఆ తండ్రికి మూలము వాని తండ్రి; ఆ తండ్రికి మూలము వాని తండ్రి; యిట్లా యెంత చెప్పినా యింతేగదా! అట్లే కార్యమునకు ఒక కారణము, ఆ కారణమునకు మరొక కారణము యిట్లా చెప్పకొంటూ పోవుట అనవస్థా దోషము, కనుక అట్లా చెప్పరాదు. పరమ కారణమైన పరమాత్మకు మరొక కారణమన్వేషించుట దూష్యము అది అవిద్యా దోషము అని కొందరు వాదింతురు అట్లు వాదించుటకు మత దురభిమానమని చెప్పక తప్పదు! ఏలననగా పుట్టిన వస్తువు మరొక దాని పుట్టుకకు కారణము కాగలదు. పుట్టిన దైతేనే పుట్టించగలదు గిట్టించగలదు. మరి యీ పరమాత్మయే జగత్కారణ వస్తువని సర్వశ్రుతి సమ్మతమై యున్నదే! కనుక యిది పుట్టి యుండవలదా? యెట్లు దేనికి పుట్టినది? అని యెవరైన ప్రశ్నించవచ్చును, దానికి శ్రీకృష్ణదేశికేంద్రులు "జగము వలన సంకల్పము. జగమాసంకల్పమున జనియించును. వేరగుపడదు. జన్మమందిరము XXX' 'అంటూ సమాధానమిచ్చి యున్నారు అనగా స్థూలము జగత్తు సంకల్పరూపమైన జ్ఞానము స్థూలసూక్ష్మ రూపముగానున్న పరమాత్మ యందు స్థూలమునుండి సూక్ష్మము సూక్ష్మమునుండి స్థూలము పుట్టుచూ కారణ కార్య పరంపర యేర్పడుచున్నదన్నమాట, ఆవిధముగా పరమాత్మ కూడా పుట్టుక కలదే యగుచున్నది పుట్టినది గిట్టక తప్పదు, కనుక ఈ పరమాత్మ నిత్యమైనది కాదు సత్యమైనది కాదు.

ఈ శ్లోకములోనే "జన్మశూన్యం స్వభావతః" అన్నారేమి? ఇక పుట్టుక కలదనుట యెట్లు? అని శంక కలుగవచ్చును గాని పుట్టుచూ చచ్చుచూ వున్నట్లు భ్రాంతిచే తోచబడుచూ వున్నందుచే పుట్టిందన్నారు. గాని ఈ పరమాత్మ నిజంగా పుట్టనేలేదు పుట్టని యెరుకతా గిట్టబోదు అనేదే పరమసిద్ధాంతము. కార్యకారణ పరంపరా రూపముగా చక్రాకృతిలో పరిభ్రమించు యెరుక పరిపూర్ణ పరబ్రహ్మమందు పుట్టలేదు. పుట్టించుటకు మరొకటిలేదు. కనుక యెరుకకు పుట్టు చావులులేవు. కార్య కారణములు రెండూ గాక తాను తప్ప రెండవదియే లేని కేవల పరిపూర్ణ పరబ్రహ్మ (Absolute Brahman) మునకు పుట్టు చావులు లేవు; యెరుకకూ పుట్టుచావులు లేవు. పరిపూర్ణమునకునూ పుట్టుచావులు లేవు, కనుక రెండూ ఒకటేయని ఏలయనరాదు? అంటే - ఎరుక కార్యకారణ పరంపరలో చేరి నిరంతర పరిణామశీలమై ఎప్పుడూ ఏకరీతిగా నుండుట లేదు. కనుక అనిత్యమైయున్నది మార్పు చెందుచూవున్నది కనుక మాయయై వున్నది మరియు చలనశీలముకలదై చలించుచున్నది. అన్నిటికీ తానే కారణమై, తన కన్యకారణము లేనిదై. అనగా మూలమే లేనిదై యున్నది. ఎండ మావుల వలె తోచబడుట మాత్రమే కాని సత్యముకానిది. ఖండా ఖండములు, ఏకానేకములు సర్వస్వగత భేదములు కల్గియున్నది. పరిపూర్ణమట్లు గాక. కార్యకారణములు కాక, సత్యమై నిత్యమై అచలమై సర్వద్వంద్వ రహితమై. సర్వ పరిపూర్ణమై, కేవలమైయున్నది. "అది యిదికాదు యిది అదికాదు." అని శ్రీ శివరామ దీక్షిత సిద్ధాంతము.

విశ్వమునందు సమస్తము సాపేక్షికమైనది. అనగా పరస్పరము ఒకదానిపై నొకటి, అన్యోన్యా శ్రయములై ఆధారపడి యున్నవి. నిరపేక్షికమై కేవలమై యున్నదొక్క పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రమే. శబ్దజాలమంతయు సాపేక్షికమే ఒక శబ్దము స్ఫురించినచో, దాని ననుసరించి దానికి సంబంధపడిన ప్రతి యోగిపదము. (వ్యతిరేక పదము) స్ఫురించును. సర్వ ద్వంద్వములు యీ రీతిగా సాపేక్షికములే అయి వున్నవి. జ్ఞానజ్ఞానములు, సుఖదుఃఖములు. పుణ్యపాపములు మొదలగునవన్నియు యిందుకు ఉదాహరణములే ఈ శ్లోకములో చెప్పబడిన జనన మరణములు కూడ సాపేక్షికములే కనుక జన్మభావము కల్గినపుడు మృత్యు భావము స్ఫురించును. సర్వ పరిపూర్ణముగానిండి నిబిడీకృతమై యున్న పరిపూర్ణ బ్రహ్మమునందు జననమరణములకు. రాకపోకలకు మరియెట్టి భావాభావములకు తావేలేదు. అందేదియూ పుట్టనేలేదు లేనప్పటికీ వున్నట్లు తోచబడినదని చెప్పుటకైనా కనీసంవీలులేదు. దేనికి భ్రాంతి కలిగినదో ఆదియే లేనప్పుడు, పుట్టినదని గాని తోచినదని గాని ఏమాట పల్కుటకూ సావకాశం లేదు. కనుక మాటయే మాయ అన్నారు శ్రీకృష్ణ దేశికేంద్రులవారు. అంతేగాక, భ్రమయనిన, పుట్టుకనినను భ్రమకే నామంబు నిట్టి భ్రమనే నీవున్. భ్రమ యీ మేను జగత్తులు. భ్రమ యెరుకయు మరుపు రెండు, భ్రమె భ్రమ వినరా" అను కందపద్యములో 'భ్రమే భ్రమ' అనగా. భ్రమకల్గినదనుటయే భ్రమయని యుద్ఘాటించినారు. కనుక యెరుక సర్వ శూన్యము అని సిద్ధాంతము, దానియొక్క సర్వ

స్వరూపములున్నూ సర్వశూన్యమే అని వేరే చెప్పనక్కరలేదు. పరిపూర్ణ బోధ గురుకృపచే నారూఢ పరచుకొన్న వానికి యీ యెరుక మహాశూన్యమై నశించుచున్నది. అపుడు పరిపూర్ణ బ్రహ్మమే శేషించుచున్నది. కాని శ్రీ కృష్ణ దేశికులవారు లేనేలేనని నేనే లేక పోయిన వెనుక తానుండుగద! అని శిష్యుడంటే, వుంటే దాన్నెట్లెరిగదవీవు అంటూ దానిని నీవుండిన కనుఁగొని చనందగు మండితసత్కీర్తిసాంద్ర మానవచంద్రా!" అన్నారు సర్వం పరిపూర్ణము. ఆ పరిపూర్ణము నందు సర్వశూన్యం యెరుకే.

6. శ్లో॥ జన్మాభావే, కర్మం నాస్తి, కర్మాభావేఫలంనహి
ఫలాభావేభయంకుత్ర, భయాభావేనసంశయః ॥

తాత్పర్యము : జన్మలేనిచో కర్మలేదు. కర్మలేనిచో కర్మఫలమున్నూ యుండజాలదు కర్మఫలములేనిచో, యికయెక్కడైన భయమెందు కుండును? ఎట్టి భయమూలేనపుడు అభయ స్వరూపమూ. అసంశయ రూపమునైన పరిపూర్ణ పరబ్రహ్మమే స్వతస్సిద్ధమై యుండును.

వ్యతిరేక పద్ధతిలో చెప్పవలెనంటే, సంశయము లున్నంతవరకూ భయభ్రాంతులుండక తప్పవు. కనుకనే శ్రీకృష్ణ దేశికేంద్రులు,

కం॥ సంశయమె జన్మ హేతువు
సంశయమె గురుని మాటచవిగోననీ యదు
సంశయమె కీడు నొదవును
సంశయమెడ బాస్తి వేని చాలును వత్సా ॥

అన్నారు, "సంశయాత్మావినశ్యతి" అని గీతావాక్యము. కాన గుర్తెరిగే తెలివి యున్నంత వరకు-సంశయములు చిదిమిన కొలదీ చిగిరిస్తూనే యుండును. కనుక సర్వసంశయ రాహిత్యము కావలెనన్న, సర్వసంశయ కారణమగు గుర్తెరిగే శరీరమునకు చోటీయని పరిపూర్ణ పరబ్రహ్మమును పరిపూర్ణ బోధరీత్యా గురు ముఖతః తెలిసి కొనవలసి యున్నది.

సంశయము భయ కారణమెట్లగుచున్నది వుదాహరణకు - జన్మరాహిత్యము కావలెనన్న జన్మకారణమును సమూలంగా లేకుండా చేయవలెను గదా! జన్మకారణమేది? జ్ఞానరూపమగు బ్రహ్మమా? లేక జడరూపమైన ప్రకృతియా? జ్ఞానరూపమగు బ్రహ్మమే మోక్షస్థాన మందురే! మరి ఆ బ్రహ్మమే జగత్కారణమని, శ్రుతి స్మృతులు బ్రహ్మసూత్రములు ఘోషించు చున్నావి! ఆ కారణ బ్రహ్మమే సత్యమూ, నిత్యమూ అని మరొక వంక యుద్ఘాటించుచున్నవే! జగత్కారణము సత్యమైతే జగత్తుకూడా సత్యమే కావలసియుండునే! అపుడు జగన్మిథ్యావాక్యములన్నియు దబ్బర కావలసి వుండును!

యీ విప్రతిపత్తి తొలగుటెట్లు? కార్యముల దృష్ట్యా కారణ బ్రహ్మము సత్యత్వ నిత్యములు గలదై యున్నదేగాని కారణ బ్రహ్మమునకు నిరపేక్షక కేవల సత్యత్వములేదు అని చెప్పి తీరవలసిందే. కార్యరూపజగత్తు సాకారము, కారణరూప బ్రహ్మము నిరాకారముగానున్ననూ, కార్యకారణములు వేరుకావు కనుక సాకారములు అనిత్యమూ నిరాకారము నిత్యమూ అని చెప్పరాదు.. అందుకే నామరూపాలు మాత్రం మిధ్యయని, వారు సమన్వయింతురు. కాని నామరూపాల వెనుక వానికి అధిష్ఠానంగా నున్న వస్తువు సర్వకారణమైన ఆత్మయేగదా! కనుక వివిధ నామరూపాలతో,తోచేదంతయు వస్తుత: ఆత్మయేయై అది సత్యమనియంటే, యిక మిధ్య యని యేవస్తువుననవలెను? నామరూపాలు మిధ్య అన్నాము గదా అంటే, నామరూపాలు వస్తువు కాదు గదా! శ్లో॥ అస్తి, భాతిప్రియం రూపం, నామచేత్యంశపంచకం," అని చెప్పబడినపుడు నామరూపాలు అంశములు (లేక లక్షణములు) మాత్రమే. ఈ అంశములలో "అద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపంతతో ద్వయం" అని రెండవ పాదములో చెప్పబడినది కనుక రూప నామములు మాత్రమే జగద్రూపం, అజగత్తు మిధ్యావస్తువు అని జవాబు చెప్పుట కుదరదు ఏలయనగా, అ పంచ అంశములూ ఒకే వస్తువుయొక్క లక్షణములేగాని రెండు వస్తువులు కావు "బ్రహ్మ సత్యం, జగన్మిధ్యా" అనేమాట సమర్థించ వలెనంటే, సత్యమైన బ్రహ్మమొకటిన్ని, ఆ బ్రహ్మమున కన్యమైన మిధ్యయైన వస్తువొకటిన్ని ప్రతిపాదించ వలసి వుండును. "పరిపూర్ణ మొకటి దక్కని తరమైన ప్రపంచమెల్ల తగ దెలియుము నీవేరుకేనని మదిలోపల " అని శ్రీకృష్ణ దేశికేంద్రులు సెలవిచ్చినట్లుగా పరిపూర్ణ పరబ్రహ్మమే సత్యమనిన్ని దాని కన్యమై కారణకార్య రూపాంగాతోచే ఆత్మ జగత్తులు మిధ్యారూపమగు యెరుకయనిన్ని గ్రహించ వలసి వుండును, కనుక అయెరుక యొక్కనిరూపణచేసి, నిరసన గావించి, దాని భావమును గురుబోధచే దృఢపరచు కొనుటయే కర్తవ్యము.

జన్మించిన ప్రతిప్రాణికర్మచేసి, ఆ కర్మఫలము ననుభవించుటకై మరల జన్మయెత్తు చుండుననుట నిర్వివాదాంశము, కర్మవుంటే తత్ఫలమనుభవించక తప్పదు, కర్మచేయకుండా వూరకుండుట సాధ్యముకాదు "నహికశ్చిత్. క్షణ మపిజాతు తిష్టత్య కర్మకృత్" అనగా యెవరైన, నొక క్షణమైన, యెట్టి కర్మయు చేయకుండ నుండ జాలరని గీతయుద్ఘాటించుచున్నది గదా! ఇక కర్మలేకుండా వుండవలె నంటె జన్మయే లేకుండాపోవలెను. లేదా కర్మఫలము అంటకుండా నుండు విధమున కర్మ చేయవలెను. పరిపూర్ణ బోధవలన మాత్రమే యీ రెండున్ను సిద్ధించును. జన్మ, కర్మ, కర్మ ఫలము, భయము, వీని అన్నిటి యొక్క రహితమునందే, సర్వభ్రాంతి రహితమూ, సర్వసంశయ రాహిత్యమూ కాగలదు.

కనుక అభావశబ్దము యొక్క నిష్కర్ష విచారించి తెలసికొన వలసి యున్నది. భావశబ్దమునకు అభావశబ్దము ప్రతియోగి, భావమనగా, తలంపు ఆలోచన అని సామాన్యార్థము, విశేషార్థములో, సత్త, అస్తిత్వము (వునికి) కల్గియున్న పదార్థము లన్నియు

భావపదార్థములు, నిజమగు వునికి లేని పదార్థము లన్నియు అభావపదార్థములు, కనుక అస్తి, నాస్తి శబ్దములు భావాభావములకు సమానార్థములుగా గ్రహింపనగును. శ్లోకములోని నాస్తి శబ్దమీయభావశబ్దమునకు పర్యాయ పదముగా ప్రయోగింపబడుట గమనార్హము, శాస్త్రము నందీయభావపదార్థములు ముఖ్యంగా నాల్గు తరగతులుగా విభజింపబడినవి.

1) ప్రాగభావము :- పూర్వమునందు లేనిదై ప్రస్తుతముగానవచ్చునది. ఘటోత్పత్తికి పూర్వము ఆఘటము లేదనుట ప్రాగ భావమునకు దృష్టాంతము.

2) ప్రధ్వంసాభావము :- వస్తువు నశించిన పిదప ఆ వస్తువు లేకపోవుట, ఘటనాశనానంతరమాఘటము లేకపోవుట ప్రధ్వంసాభావమునకు దృష్టాంతము దీనికే ప్రత్యగ భావమని కూడ పేరు.

3) అన్యోన్యా భావము :- రెండు వస్తువులలో యేవస్తువు నందునూ లేకుండానే (అనగా అభావముగా నున్ననూ) ఆ రెండు వస్తువుల సంయోగంలో యేర్పడి, వాని వియోగములో మరల లేక పోవుట అన్యోన్యాభావమనబడును. రెండు అరచేతులలో దేనియందనూ లేనప్పటికి, వాని పరస్పర తాకిడిలో శబ్దము యేర్పడు చున్నది, అట్లే మనఃప్రాణముల రెంటిలో యేవక దానియందునూ లేనప్పటీకి అవి రెండు కలసినపుడు గుర్తుకలుగుచున్నది. ఎట్లుఅనగా, మనస్సు అంతఃకరణమునందు మగ్నత చెందినపుడు, ప్రాణమొక్కటే వుఛ్వాస నిశ్వాస రూపముగా ఆడుచుండును, అపుడు గుర్తులేదు. అట్లే సమాధి యందు ప్రాణనిరోధమేర్పడి నపుడు గుర్తులేదు, కాని ఆమనః ప్రాణముల సంయోగములో మాత్రమేగుర్తు (Consciousness) కలుగుచున్నది. యివి అన్యోన్యా భావమునకు దృష్టాంతములు.

4) అత్యంతాభావము :- ఏదేశము (ప్రదేశము) నందుగ్గాని ఏకాలమునందుగాని, ఏవస్తువునందు గాని, యేకించిత్తూ లేక పోవుటయే అత్యంతాభావము కనుక, శశిశృంగము (కుందేటి కొమ్ము) వంటి కేవల అళీక పదార్థమే దీనికి దృష్టాంతము.

ఈ శ్లోకములోని అభావశబ్దము, పై నాలుగు అభావములలో ఏఅభావమై యున్నది? అంటే, "ఆదావంతేచ యన్నాస్తి వర్తమానే పితత్తధా." అనగా పూర్వాపరముల యందునూ ఆద్యంతములయందునూ లేని వస్తువు మధ్యయందునూ (లేక) వర్తమానమందునూ వుండదని చెప్పవలసినదే యని భావము, కనుక త్రికాలముల యందునూ, ఆది మధ్యాంతముల యందునూ, యేకొంచమూ లేదుగనుక యీ అన్ని అభావములున్నూ చెప్పవచ్చును.

మరియునూ జన్మేలేనిచో మరణము లేదు. కర్మాకర్మలు లేకుంటే, సుకృత దుష్కృత ఫలములన్నూ లేవు. త్రివిధ రూపములు చెప్పబడిన కర్మఫలములు ఆగామీ, సంచిత

ప్రారబ్ధములున్నూ లేవు కర్మ ఫలములైననూ వాసనారూపములుగా నిలచి, బీజములై (కారణములై) జన్మలెత్తించి, సుఖదుఃఖములు కల్గించుననే భయమున్నూ లేదు. తాను పుట్టనేలేదు గనుక, సంశయ, విపర్యయాదులగాని, యదార్థ, అయదార్థ జ్ఞాన జ్ఞానములు గాని లేనే లేవు. జననమరణ రూపసంసారమునకు అత్యంతమూలకారణమగు పరమాత్మ, పరిపూర్ణ పరబ్రహ్మమునందు పుట్టలేదు కనుక లేనేలేదు.

భయమెట్లు కలుగునో యించుక విచారించుదము. ఆకాశార్ధములో వ్యష్టి నాల్గవ భాగము పృధ్వీభూతములో చేరుటవలన అంతఃకరణమునందు భయము కల్గునని సాంఖ్యము చెప్పుచున్నది. కాని భయోత్పత్తికి అత్యంతమూల కారణమును వుపనిషత్తులు చాలాగొప్పగా సిద్ధాంతీకరించినవి "ద్వితీయాద్వైభయం భవతి" అనగా ద్వైతమందు, (అనగా రెండవదిఅంటూ వకటివుంటే) భయము పుట్టుక తప్పదన్నమాట. తానుతప్పరెండవదే లేకపోతే యిక దేనిని గురించి భయపడును? కనుక "ఏకమేవా అద్వితీయం బ్రహ్మ" అనుశ్రుతికి, బ్రహ్మమువంటిది మరొకటి లేదని అన్యులు వ్యాఖ్యానిస్తే, "నేహనానాస్తికించన," "బ్రహ్మణోన్యంనకించన" అను శ్రుత్యర్థములతో మేళవించి బ్రహ్మమొక్కటే తప్ప రెండవది లేనేలేదు. అని అద్వైతులు సిద్ధాంతంచేసినారు. కాని "ఏకం అనేకం భవతి" (అనగా మొదటి ఏకమైన ఒకటి గానున్న వస్తువే పిదప అనేకంగా మారినది. (లేక) అనేకములై వున్నవన్నీ ఏక వస్తువునుంచే కలిగినవి) అని, చెప్పబడు చున్నపుడు ఆ అద్వితీయ ఏక బ్రహ్మమే భయమునకు అత్యంత మూలకారణమని చెప్పక తప్పదు. కనుక, ఏకానేకములుగా నుండే యీ కారణ బ్రహ్మము ఒకప్పుడు అభయ స్వరూపమూ, మరొకపడు భయస్వరూపము అగుచూ, ద్వయదోషదూషిత మగుచున్నదని చెప్పుట శ్రుతి సమ్మతమైవున్నది. కనుకనే, ఏకానేకములు, సదసత్తులు, ఆస్తినాస్తులు, భావాభావములు మొదలగు సాపేక్షిక శబ్దములచే వర్ణింపరాని, కేవలనిరపేక్షకపరిపూర్ణ పరబ్రహ్మమే, కేవలం అభయ స్వరూపమని అచల ఋషుల సిద్ధాంతం.

ప్రాణులన్నిటికీ గల గొప్ప భయమేది? మరణభయము అని తేలికగా జవాబు చెప్పవచ్చును. ఈ మరణభయమూ, మానవులకేగాక, పశుపక్షి క్రిమికీట కాదులకును కలదనుటలో సందేహము లేదు. కాని ప్రాణులన్నిటియందునూ మరణమన్న మానవుడే యెక్కువ భయము పొందుచున్నాడు. ప్రాణులయందుగల జ్ఞానము నందలి న్యూనాధిక్యతలే ఇందుకు కారణము. మానవు డెంతటి విశేషజ్ఞాన సంపన్నుడో అంతటి భయభ్రాంతులకు లోనగుచున్నాడు. మానవునకుండే ఆలోచనాశక్తి, ఊహాగాన విశేషము యితర ప్రాణులకు లేవు. లేని భయములను గూడా వూహించుకొని, ముందుగానే వానికి వివిధ రక్షణోపాయముల నన్వేషించుచున్నాడు. "జాతస్య హిధృవో మృత్యుః" (అనగా పుట్టినది గిట్టక తప్పదు) అని యెరిగి యుండియు ఆ మృత్యువునుండి తన్ను రక్షించుకొనజాలక పోవుచున్నాడు. కనుక మృత్యువు కంటే భయానకమైనది. మరొకటిలేదు. కాని భగవద్గీతలో "దేహినోస్మిన్ యధాదేహేకౌమారం యౌవనంజరా! తదాదేహాంతర ప్రాప్తిర్ధీర స్తత్రనముహ్యతి" అనగా

జీవితంలో బాల్యయవ్వన వృద్ధాప్యములు దేహమున కెట్లు కలుగుచున్నవో, అట్లే మరణమున్నూ కల్గి అన్యదేహమును పొందుచున్నాడని తెలుసుకొని, జ్ఞానులు శోకింపరు, అని చెప్పబడినది. కనుక మరణమన్న భయమెందుకు? దుఃఖమెందుకు? కాని యోచిస్తే మరణమంటే జ్ఞానులే నిజంగా భయపడ వలసి వున్నది. ఏలననగా బాల్యయౌవనకౌమార వార్థక్యముల వంటిదే మారణావస్థయున్నూ అని తెల్సు కొన్నంత మాత్రమున, మరణ భయము లేకుండాపోవునా? ప్రపంచసుఖములు, ఆస్తిపాస్తులు, భార్యా బిడ్డలు బంధుమిత్రులు, కీర్తిప్రతిష్టలు, మొదలగునవన్నియు విడిచి పోవలెనుగదా యని మానవుడు భయ దుఃఖములను పొందుచున్నాడు. దేహమునుండి ప్రాణము నిష్క్రమించు సమయములో (సహస్ర వృశ్చికములొక్క సారిగాయెకే స్థానమున కుట్టినచో యెంత బాధకల్గునో అంతటి బాధ మరణకాలమున కల్గునని కొందరందురు) యెంత బాధకల్గునో యను యని భయపడుచున్నాడు. మరణానంతర మెట్టినీచ యోని ప్రాప్తి కల్గి యెంత దుఃఖ మాశరీరముతో ననుభవించవలెనో యని భయపడుచున్నాడు. ఇట్టి భయములన్నియు నిజంగా వివేకవంతుడగు జ్ఞానికే గల్గుచున్నవి. అట్టి జ్ఞానియే గురుపాదము లాశ్రయించి జన్మరాహిత్యమునకై కృషి చేసి కృతార్థుడు కాగలడు.

పుట్టిన ప్రాణిచచ్చుట, చచ్చినప్రాణి పుట్టుట తప్పదన్నపుడు, యిక జన్మరాహిత్యమేమి? పరిపూర్ణ బోధయందారుఢుడైన వాడు గూడ మరణించుచున్నాడు గాదా! యని కొందరు శంకించ వచ్చును, వారు మరణ మనగా నేమో కొంచెం తెలుసుకొనవలెను, తిరిగి జన్మకల్గించు బీజము నిలచియేయుండగా శరీరం మాత్రం పోవుట మరణము జీవించి యుండగనే అట్టి బీజమును నాశనము చేసుకొని శరీరత్యాగం చేసినచో, దానిని మరణ మనరాదు. దానిని బ్రహ్మైక్యమనో, సిద్ధియనో మరొక పేరుతోనో వ్యవహరించ వలసి వుండును.

"ఫలాభావే భయంకుత్ర" అని శ్లోకమూ ప్రశ్నించు చున్నది ఆగామిసంచిత ప్రారబ్ధములగుత్రివిధకర్మఫలములూ లేనిచో జన్మయే వుండదు. జన్మలేనిచో (తానేలేనిచో) కర్మత్రయ మెవరికుండును? వ్యష్టిసమష్టుల యందు తన్ను లేకుండా చేయునదే పరిపూర్ణబోధ, అందారూఢత సాధించిన వానికి ఏభయముండదు. ఏ సంశయుమూ వుండదు. అసంశయమూ, అభయస్వరూపమూనగు పరిపూర్ణబ్రహ్మమే శేషించి యుండును. "ఎరుకే చదువులు చేసును. యెరుకే విను, చదువు యెరుక నెరుకే తిరమంచెరి గించును శంకించును" XXX కనుక సర్వ సంశయములకు నాటపట్టుగా నున్నది యెరుక, ఆయెరుక యేమీలేనిది పరిపూర్ణ పరబ్రహ్మము. కనుక దానిని అసంశయరూపంగా శ్లోకమభివర్ణించినది.

7. శ్లో॥ "ఇన్ద్రజాలమిదం సర్వం యథామరుమరీచికా !
అఖండిత మనాకారం కేవలం వర్తతే శివం ॥

తాత్పర్యము : ఈ దృశ్యమంతయు, యింద్రజాలములో తోచు వస్తుసముదాయము వంటిదే. ఎండమావుల జలమువలె భ్రాంతిగొల్పుచున్నది. నిజముగా నున్నదొక్క పరిపూర్ణ పరబ్రహ్మమే. అది అఖండము కేవలము అమలము.

జాలమనగా, మాయ, గారడి, కపటము, మోసము అను అర్థములున్నవి. యా, మా, సా, మాయ అనే నిర్వచనానుసారము, ఏదిలేనిదో, అదిమాయ, కనుక నిజముగా లేనిదానిని వున్నట్టుగా భ్రమింపచేయుటయే జాలము లేక, వున్న వస్తువునే ప్రేక్షకులకు గానరాకుండా,హస్త లాఘవము, గళ్ళపట్టు మొదలగువానిచే మరుగుపరచి, గొప్ప మహిమాన్వితునివలె ఆకాశము నుండియో, గాలిలోనుండియో, ఒకానొక వస్తువును నూతనముగా సృష్టించి తెచ్చినట్లు భ్రమింపజేసి ప్రదర్శించుట యీ రెండవ విధంగా గారడి విద్యలను అభ్యాసముచే సాధించవచ్చును. మొదటి విధమగు జాలము చాలా కష్టము. కేవలం లేని వస్తువును, వున్నట్టుగా భ్రమింపచేయవలెననిన, ప్రేక్షకుల యింద్రియ మనస్సులను తన యిచ్ఛానుసారం తాను నిర్ణయించిన ఆకారవికారములనే ప్రేక్షకులు గుర్తించి సాక్షాత్తుగా అనుభవించునట్లు చేయుట ఎంతయో కష్టము. చిరకాల సాధనా ఫలితమునగాక యీమానసికశక్తి సిద్ధించదు. జాలములలో కెల్ల రాజనదగును కనుక దీనికి యింద్రజాలమని పేరు వచ్చినది. నేటి కాలమున వ్యాప్తిలోనున్న మెస్మరిజం, హిప్నటిజం, మొదలగు శక్తులు యీ యింద్రజాల విద్యతో పోల్చినచో చాలా అల్పముగా కానవచ్చును. పూర్వకాలమున కొందరు బ్రాహ్మణులు యీవిద్యలను అభ్యసించి రాజా స్థానములలో ప్రదర్శించి యినాములు అగ్రహారములు సంపాదించి జీవయాత్ర సాగించెడివారని, వారినే విప్రవినోదులు అని పిల్చెడివారని అనుశ్రుతముగా వినవచ్చుచున్నది. ఇంద్రజాల, మహేంద్రజాల, టక్కు టమార, గజకర్ణ, గోకర్ణాదిగా 64 విద్యలపేర్లున్ను ప్రచారములోనున్నవి. షట్చక్రవర్తులును వారి వారి జీవితములలో యీ ఇంద్రజాలాది విద్యలను సందర్శించి ఆ జాలమునకులోనై స్వర్గాది లోకములకు పోయినట్లును, సకలభోగములు అనుభవించునట్లున్ను లేదా అనేక యుద్ధములలో ఘోరరాక్షసులను దునుమాడి విజయ పరంపరలను సాధించినట్లుచిత్ర విచిత్రానుభవములు పొంది స్వప్నము నుండి మేల్కొన్న విధంగా మరల యధాస్థితికి వచ్చి జాలకుని విద్యకు అచ్చెరువంది సన్మానించెడి వారని గాథలెన్నో గలవు. విక్టోరియా రాణి పరిపాలనలో సహితం భారతదేశమునుండి యిట్టి యింద్రజాలకులు యింగ్లాండు పోయి రాణీగారి సమక్షంలో Rope Trick (పగ్గం గారడీ) ప్రదర్శించి భారతీయ యింద్రజాల విద్యను ప్రదర్శించి ప్రపంచమును ఆశ్చర్యాంబుధిలో ముంచి నారట. ఈ గారడీలో, ఒక బలమైన పగ్గము కర్రవలె నిటారుగా ఆకాశములో భూమిపై యెట్టి ఆధారము లేకనే నిలబెట్టబడి కనిపించును, కత్తి, డాలు, ధరించి యుద్ధవీరుని వేషములో చేతిలో నొకజాబుతోవచ్చి దానిని ప్రేక్షకులకు చదివి వినిపించును. దేవాసురుల యుద్ధములో వచ్చి తన తరపున యుద్ధము చేసి విజయము సాధించి పెట్టుమని ఇంద్రదౌత్తరములో ఈ వీరుని ప్రాధేయపడును.

రాక్షసులు చంపివేస్తారని యుద్ధమునకు పోవలదని భార్యవచ్చి రోదించుచున్నను వినుపించుకోక ఆ యోధుడు ఆ పగ్గమునాధారముచేసికొని పైకియెక్కి పోయి అదృశ్యుడైపోవును. భూమిపైనున్న భార్యకు మరొక జాలకుడు ధైర్యము చెప్పుచుండును. ఇంతలో ఆకాశముపై నుండి ఆ యోధుని కాళ్ళుచేతులు, తల మొండెము లొక్కటొక్కటిగా భూమిపైబడి పోవును, అతని భార్య దుఃఖముతో భూమిపై దొర్లి దొర్లి రోధించుచుండును. ఇంద్రజాలకుడు, నీ భర్తను బ్రతికెంచెదను ఏడవకుమని ధైర్యము చెప్పుచూ ఆ శరీర భాగములు నొకటిగాచేసి ఒక వస్త్రము గప్పి ఆ యోధుని బిగ్గరగా పేరుపెట్టి పిలుచును. తెరవెనుకనుండి సజీవుడై బీరములు పల్కుచు ప్రేక్షకుల యెదుటకు పరుగెత్తి వచ్చును ఇట్టివే అనేక అద్భుత దృశ్యములను నాటి విప్రవినోదులు ప్రదర్శించెడివారట.

"ఇదం సర్వం" అనుటలో పంచేంద్రియములు చేతను, మనస్సుచేతను తెలుసుకొనబడెడి సమస్తమూ కూడా నన్నమాట, సాకారమూ, నిరాకారమూ, సగుణమూ, నిర్గుణమూ జ్ఞానాజ్ఞానమూ, జ్ఞానగమ్యమూ, కర్తాకారయితా కార్యమూ వేయేల ఏదేది తెలియసాధ్యమైనదో తత్సర్వమూ యింద్రజాలము వంటిదే నన్న భావము. ఇంద్రజాలము మాత్రమే అసత్యముగాని ఇంద్రజాలకుడు సత్యమేగదా! అట్లే కార్య రూపమగు సృష్టి అసత్యముగాని సృష్టి కారణమగుబ్రహ్మము మాత్రము సత్యముఅని కొందరు వాదించవచ్చును ఐతే ఇంద్రజాలమునందలి, దృశ్యములన్నిటికి కారణము. జాలకుని యొక్క మహిమారూపమగు మనస్సుయొక్క సంకల్పబలమే అయివున్నది. అట్లే సృష్టి కారణమగు బ్రహ్మముయొక్క స్వరూపలక్షణము అఖండ జ్ఞానమే అయివున్నది. స్వప్నావస్థయందు సంకల్పరూపమగు మనస్సే మనస్సుచేతనే మనస్సుయొక్క వికారరూపములనే (అనగా ఒక్క మనస్సే ద్రష్టాదృగ్ దృశ్యములగానుండి) స్వప్నమును గాంచురీతిగా కారణబ్రహ్మస్వరూపమగు జ్ఞానమే సంకల్పరూపమై ఆ సంకల్పముచేతనే ఆ సంకల్పమునే జీవేశ్వర జగద్రూపముగా తన్నుతానే చూచుకొనుచున్నది. కనుక ఇంద్రజాలకుడూ తానే, జాలముతానే, తదనుభవములున్ను తానేయై వున్నవి. కనుకనే శ్రీకృష్ణ దేశ కేంద్రులు "అన్నియు తానై, తనకనిపన్నుగ వేరనుచునోటబలుకుచు మరితానన్నిటి నేరిగేయెరుకై యున్నానని యెరుకకెరుకే నూహింపుచుండూ, తనలోతానే మోహింపుచుండూ" "అంటూ కందార్థము వ్రాసినారు. మరిన్ని పెట్టియ లోపలిగారడి చెట్టుపయిన్ గానవచ్చి చెట్టునచూడన్ గట్టుపయి దోచునిదికను కట్టుసుమీ దీనిపలెనె కనుపించు నెరుక అంతలో నెచటా కనుపించదెరుకా XXX" అంటూ యెరుకనుగారడి వానిగాపోల్చినారు. ఆ యెరుకనే గారడివాడూకూడా ఆ జాలములోనివానిగానే వర్ణించియున్నారు. కారణ బ్రహ్మముతో సహా దృశ్యాదృశ్యములన్నియు చిత్ స్వరూపములే (జ్ఞాన స్వరూపములే) అనగా జ్ఞానముయొక్క వారంరూపములేయని శ్రుతులుద్ఘాటించుచున్నవి. ఉదాహరణకు తేజోబిందూపనిషత్తులో మనోవాక్కులకు గోచరించు సమస్తమూ చిన్మాత్రముగా అభివర్ణింపబడినది.

"చిన్మాత్రమేవ, చిన్మాత్రమఖండై కరసగ్ రసం
భవవర్జితచిన్మాత్రగ్ సర్వం చిన్మాత్రమే వహి
ఇదంచ సర్వం చిన్మాత్రం చిన్మయమేవహి
ఆత్మభావంచ చిన్మాత్రను ఖండైక రసంవిదుః
సర్వలోకంచ చిన్మాత్రం త్వత్తామత్తాచచిన్మయం"

కనుక సర్వమూ చిన్మాత్రమే చిద్రూపం (జ్ఞానం) గాని వస్తువులేదు. పరిపూర్ణము వస్తువేకాదు. ఆ పరిపూర్ణము తప్ప అన్యమంతయు చిన్మాత్రమైన యెరుకే. "ఇదం" చేసూచితము, అట్లే ఈసర్వమూ మరుమరీచికలు (యెండమావుల జలం) వంటిదనికూడా యీ శ్లోకములో చెప్పబడినది: సూర్యకిరణములు మరుభూమి మంచియెండ వేళ ప్రసరించినపుడు యీ జలముతోచును. సూర్యకిరణములు నిమిత్తకారణము - యెడారినేల యే దేశము మధ్యాహ్న సమయమేకాలము. ఈ దేశకాల నిమిత్తములు మూటిలో ఏదిలేక పోయినా ఎండమావులజలము దృశ్యమానముకాదు. అట్లే దేశ కాలనిమిత్తములకులోనై యున్నదంతయు "ఇదం" శబ్దముచే అభివర్ణితము, దేశకాల నిమిత్తములతో ఎట్టి నిమిత్తంలేనిదై అతీతమై యున్నదొక్క పరిపూర్ణపరబ్రహ్మము మాత్రమేయని తెలియవలసియున్నది.

పరిపూర్ణపరబ్రహ్మము అఖండితమనాకారం అనికూడా యీశ్లోకములో చెప్పబడినది, అఖండిత మనగా చేధింపబడినది. అనగా ఖండములుగానిది అవిచ్ఛిన్నమైనది. ఆదిమధ్యాంతరహితమైనది. అనాకారం అనగా యెట్టి ఆకారవికారములూ లేని నిరాకార వస్తువని అర్థమేకాని వికృతాకారము కలది అనికాదు. సర్వాకారములుగా ఆత్మయే పరిణామ వికారములు చెందగలదు. మరిన్ని నిరాకారముగానూ యండగలదు. కాని సాకార నిరాకారములు రెండూగానిదేదో అదే పరిపూర్ణపరబ్రహ్మము. ఆపరిపూర్ణ పరబ్రహ్మము కేవలం అనీ, శివం అనీ చెప్పబడినది. కేవలం అనుటలో సజాతీయ విజాతీయ స్వగత భేద శూన్యమై తానుతప్ప అన్యమేలేని పరమ పరిశుద్ధమైనదనియర్థము. కనుకనేదానిని మహాద్వైతమని యనుటయుకద్దు. శివం అనుటలో అదిసర్వశుభప్రదమైనదనీ మంగళ ప్రదమైనదనీ అర్థము. శాశ్వత, జననమరణ రహితము సిద్ధించుటకన్న శుభమూ మంగళ ప్రదమూనైనది మరొండు లేదుగదా! అట్టి జనన మరణ రాహిత్యమొక్క పరిపూర్ణ బోధవలన గాక అన్యథాసిద్ధించదు పరిపూర్ణ పరబ్రహ్మము ఎట్టి సిద్ధిచేకూర్చుటకును సాధనముగాని, కారణముగాని కాకపోయినప్పటికిన్ని సత్యమైనది, నిత్యమైనది ఒక్క పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రమనిన్ని తదన్యమగునది అంతయూ లేనెరుక యనిన్నిదాన్కి పరిపూర్ణ పరబ్రహ్మమునందు మూలంగాని స్థానంగాని లేనేలేదనిన్ని గురుముఖతంః ఆరూఢ పరచుకొన్నపుడు రూఢిగా మానవునికి జన్మరాహిత్యము సిద్ధించుచున్నది.

కేవలం నిష్క్రియమైన పరిపూర్ణ బ్రహ్మమును 'వర్తతే' అనే క్రియాపదముతో జోడించి చెప్పబడినదేమి? యనిశంకబొడమ వచ్చును. కాని 'వర్తతే' అనేపదమునకు వర్తించుట అనే అర్థముతో పాటు "వుండటం" అనే అర్థమున్ను కలదు. ఉన్నదే అది, మరొకటిలేనేలేదు. అస్తి (వున్నది) నాస్తి లేదు శబ్దములు రెండున్ను సాపేక్షిక శబ్దములే అయివున్నప్పుడు, పరిపూర్ణం శబ్దముతో అస్తి అనిమాత్రము చెప్పనగునా? అంటే "నైవవాచానమనసా పాపం శక్యోనచక్షుషా, అస్తేతి బ్రువతోన్యత్ర కథంతదుపలభ్యతే" అనికఠోపనిషత్ ప్రశ్నించుచున్నది. వాక్కుకు మనస్సుకు నేత్రముకు గోచరించని దానిని వున్నదని చెప్పుటకంటె మరొక విధముగా యెట్లు శిష్యునికి తెలియచేయనగును? కనుక "మాటమాయైతె మానెనుమాటను మాట్లాడి మనము మానుద మవలన్ అంటున్నారు. శ్రీకృష్ణ దేశికేంద్రులు, కనుక యీ శ్లోకములో లేని దానిని లేకుండా చెప్పి వున్న దానిని వున్నదని శబ్దముచే మాత్రం సూచించబడినది. అట్ల సూచించక, లేని దానిని లేకుండా మాత్రం చెప్పి వూరుకుంటే శూన్యమునే ప్రతిపాదించునదియగునుగదా.

పైన వివరించిన విధంగా లేనెరుకయు, పరిపూర్ణ పరబ్రహ్మమును యీ శ్లోకంలో వివరింపబడినవి. ఎరుకలేనిదే అనిన్ని యింద్రజాలమువంటిది, యెండమావులవంటిది మాత్రమేననిన్ని అఖండము, నిరాకారము కేవలమూ అగుపరిపూర్ణము తప్ప యేమీలేదనిన్ని గురుకృపకే నారూఢమగుటే ఎరుకతొలగునుపాయము "కీలిదెలేని యెరుక తాతొలగ" అన్నారు శ్రీ కృష్ణదేశి కేంద్రులవారు.

8. శ్లో॥ శుద్ధే సుష్ప్తావివచ తస్మిన్నాహం కదాచన
తద్వత్సదాపి యస్యాస్తి ప్రపంచంనాస్తి తస్యవై ॥

తాత్పర్యము : "అహం" అనగా "నేను" అను వృత్తిగాఢ సుషుప్తియందు యే విధముగా లేదో, అట్లే శుద్ధమైన దానియందు అనగా పంచతన్మాత్రలు లేశమైనను లేని పరిపూర్ణ బ్రహ్మమునందు "నేను" అను ఆ యెరుక యెల్లపుడు లేనేలేదని ఏ మహానుభావునకు ఆరూఢమై యుండునో అట్టి వానికి ప్రపంచము కూడా లేనిదే యగుచున్నది.

ఈ శ్లోకంలో పరిపూర్ణ బ్రహ్మము శుద్ధము అను శబ్దముచే సూచింప బడినది. వాక్కుచే వర్ణింపరానిదై శబ్దనిశబ్దముల కతీతమై యున్న దానిని సాపేక్షికమగు వాఙ్మయ జగత్తులోని ఏ మాటచేతను నిజంగా సూచింప తగదు. ఐనను బోధకొరకు ఏదో ఒక మాటను ఆశ్రయించక తప్పదు. కనుకనే శ్రీ కృష్ణదేశికేంద్రులవారు "మాటను మాట్లాడి మనము మానుదమవలన్' ' అని చెప్పియున్నారు,

శుద్ధ శబ్దముచే పరిపూర్ణ పరబ్రహ్మమును సూచించుట యెంతయూ తగియున్నది. ఏలననగా యేవస్తువైనను శుద్ధమైనదని యన్నపుడు దానికన్యవస్తు సంపర్కము యీషణ్మాత్రము లేదని యర్థము. ఆ బ్రహ్మ స్తంభపర్యంతం గలనావస్తు సమూహంలో ఒకదానితో నొకటి సంయోగపడుట, లేక కనీసం సంబంధమూ స్పర్శా కలిగియుండుట

అనివార్యము, గదా; కనుక కేవలం శుద్ధమై వుండవలెనంటే యితరం యేమీ వుండనే కూడదు. అంటే సృష్టిలో గల ఏతత్వంగాని ఏవస్తువుగాని వుండ కూడదన్నమాట. సృష్టికారణమున్న వుండరాదు. కారణకార్యములు రెండూ లేనపుడున్న దేదో అది మాత్రమే కేవలమూ శుద్ధమైనదని చెప్పదగును. అదియే అవాంఙ్మనసగోచరమైనది. సర్వలక్షణ విలక్షణమైనది. తటస్థ స్వరూప, లక్షణములచే సహితం చెప్పరానిది. అతద్వ్యావృత్తి లక్షణముచే మాత్రమే చెప్పతగినదని కూడ చెప్పరానిది. ఏలననగా నేతి నేతి నేతీతి శేషితః'' అని యీ లక్షణచే విచారించు వాడే లేడు, "నేను" వున్నంత వరకు తాను (శుద్ధము అనగా ఆ పరిపూర్ణ బ్రహ్మము) జ్ఞేయవస్తువై దృశ్యకోటిలోనికి చేరిపోవు చున్నది. దృగ్దృశ్యములు, జ్ఞానజ్ఞేయములు మొదలగు సర్వద్విపుటులకు త్రిపుటులకు అతీతమైన అపరిపూర్ణము అవిజ్ఞేయ బ్రహ్మమైయున్నది. అట్టి దిట్టి దని చెప్పరాని యాపరిపూర్ణ పరబ్రహ్మమొక్కటే శుద్ధము తదన్యమైన దంతయు ఆ శుద్ధమైన యెరుకే 'శుద్ధాశుద్ధములు' అనునవి మాత్రము సాపేక్షిక పదములు కావా? నిరపేక్షిక మగు పరిపూర్ణ పరబ్రహ్మమును సాపేక్షిక శబ్దములతో యెట్లు సూచింపనగును? అంటే, మాట లన్నీ సాపేక్షికములే; సాపేక్షికముగాని మాటయేలేదు. మాట అంతా మాయే అట్టిమాటచే పరిపూర్ణ పరబ్రహ్మమును చెప్ప జూచుటయూ నిరర్థకమే. కాని మాయయగు మాట చేత మాయను మాత్రము ఖండిపగలము. కనుక లేని యెరుకను లేదనుటకు అనగా యెరుక నిరూపణకు నిరాకరణకు నిరసనకు మాత్రము శబ్దజాలముపకరించును. "వజ్రం వజ్రేనభిద్యతే" అన్నట్లు యెరుకచేతనే యెరుకభ్రాంతి రహితమొనర్చవలెను. కనుక పరిపూర్ణబోధ యనగా యెరుకను నిరసించు బోధయేగాని పరిపూర్ణమును గూర్చి చెప్పునదిగాదు. అందు మాటయేలేదు కనుకనే ఆది గురువగుదక్షిణామూర్తి దానిని మౌనవ్యాఖ్యచే సూచించెను. కనుకనే "పరిపూర్ణమనిన నోట పల్కుట కగునా?" అని శ్రీహనుమంతరాయ రాజయోగీంద్రులు ప్రశ్నిస్తున్నారు.

ఆ పరపూర్ణ మెట్లుండునో, తెలుసుకొనవలెనని ఆశపడుట సహజమేకాని అది యిట్టి దట్టి దని యనరానిదనీ", "వట్టి యాశల చేత పట్టుబడక ఆ గుట్టు దేశికునోట ఘట్టిగా దెలుసుకో"మ్మనీ శ్రీ కృష్ణదేశికేంద్రులవారు హెచ్చరించుచున్నారు. ఐనప్పటికీ యీ తృష్ణ చల్లారుటలేదు. అది యిట్టిదట్టిదని తెలుసుకొనగల్గుదుననుట వట్టి భ్రాంతియే ఈ భ్రాంతి రహితమునకు మరొకశ్లోకంలో "యథానాహం, తథాశుద్ధం, తస్మాద్దేననిర్ణయం" అనగా "నేను లేనప్పుడెట్లుండెనో, ఆ విధంగానే" "శుద్ధ"ము (పరిపూర్ణము) న్నూవుండును" అని తెలుసుకొని తృప్తిజెందవలసినదే. నేనులేనపుడు శూన్యముండును అని అనుకొని పరిపూర్ణమూ శూన్యమూ రెండూ ఒకటే అని ఎవరేనా అంటే అది శుద్ధతప్పు. ఎట్లననగా నీవు వుండి శూన్యమును తెలిసికొంటివా? లేక, నీవులేక శూన్యమును తెలిసికొంటివా? నీవు వుంటే అది శూన్య మెట్లగును? నీవులేకనేపోతే అది శూన్యమని యెట్లు చెప్పగలవు? ఇంతకూ నీవు లేనపుడు ఆకాశముండును అని వూహించుటయే యిట్టి అపోహకు కారణము, నీస్వస్వరూప జ్ఞానము

లేకపోవుట దేశకాలాదులన్నియు నీలోనివే గాని నీకు బయట నున్నవి కావు అని తెలియకపోవుటయే, యీ అపోహకు కారణము కనుక పరిపూర్ణము శూన్యరూపమగు అకాశము కాదు. దానితో పోల్చదగిన సాటిదేదీ లేనేలేదు. నోటితో యేమనుటకున్ను వీలులేదు పరిపూర్ణ మనిగాని కేవలం శుద్ధమనిగాని మరేమనిగాని పలుకరానిది అని తెలియవలెను.

సుషుప్తి (గాఢనిద్ర) అనగా యెట్టిదో విచారించి, పరిపూర్ణ పరబ్రహ్మమునకు సాటువగా చెప్పవచ్చు నేమోయించుక విచారింతుము. జాగ్రదవస్థయందు 25 యింద్రియముల ద్వారా బాహ్యవస్తువులను అందలి శబ్దాది విషయములను, తననూ, గుర్తించు చున్నదనుటచే బాహ్యప్రజ్ఞ గలదని నిర్ణయించినారు. స్వప్నావస్థలో, మనస్సు అనే ఏకేంద్రియముతో (యితరేంద్రియముల సహాయమేమిన్ని లేకనే) మనస్సు నందలి సంస్కార బలముచే బహు రూపములు తానే వహించి అందలి శబ్దాది విషయములను భావనా రూపముగా ఆ మనస్సే భోగించుచు సుఖదుఃఖాదులను అనుభవించు చుండుటచే అంతః ప్రజ్ఞగల్గియున్నదన్నారు. ఇక గాఢసుషుప్తిలో బాహ్యప్రజ్ఞగాని అంతఃప్రజ్ఞగాని లేక మరణ శరీరమువలె, తన స్థూల శరీరము పడియుండగా ప్రాణము మాత్రము వుచ్ఛ్వాస, నిశ్వాస రూపంగా రాకపోకలు సాగించుచుండును. కనుక హృదయ స్పందనం రక్తప్రసారము, జీర్ణక్రియ మొదలగు అనైచ్ఛికక్రియలు మాత్రము యధాప్రకారము జరుగుచుండును. హృదయస్థానమున అజ్ఞానావృతమై మనస్సు ప్రాణ సంయోగములేక యండుటచే గుర్తెరిగే జ్ఞానవిహీనమై (Unconscious) గా అంతర్బాహ్య ప్రజ్ఞలు ఏమియు లేక పడియుండును ప్రజ్ఞ యనగా గుర్తు. యీ ప్రజ్ఞయును దానిచే తెలియబడు స్థూలసూక్ష్మ ప్రపంచములున్నూ విత్తనమునందలి మహావృక్షమువలె దాగియుండుటచే యీ అవస్థయందలి శరీరమును కారణశరీరమని అన్నారు. విచారించిచూచినిచో యీగాఢ సుషుప్తియందు నిజంగా లేనిదేది? ఐచ్ఛికంగా గుర్తించి చేయబడు క్రియారూప కర్మలుగాని భావనారూప కర్మలుగాని తాత్కాలికముగా మాత్రంలేవు. మిగిలిన వన్నియు సంపూర్ణముగా (అనగాస్థూలశరీరము, యింద్రియము, జీవచేతనము, ప్రాణచలనము ప్రత్యగాత్మ ప్రకాశము) నున్నవి సుషుప్తియందు యీయెరుక (జ్ఞానము) కూడా మరుపురూపంలో నున్నదిగాని అసలే లేదనరాదు. యెరుక మరుపులు (లేక) జ్ఞానాజ్ఞానములను రెండు రూపములుగా నున్నది. ఎరుక పనిచేయక, వూరకయున్నపుడు, అనగా గుర్తెరుగ నపుడు మరుపు అని పేరు పెట్టుట జరిగినది. జాగ్రదవస్థయందు యెరుక రూపం మరల చెందుచున్నది. కనుక సుషుప్తియందు తాత్కాలికంగా యెరుక యేమీ గుర్తించకుండా వున్నదని మాత్రమే చెప్పదగును. శ్లోకమునందు "కదాచన" అనుశబ్దప్రయోగ మీ భావమునే సూచించుచున్నది.

సుషుప్తిపరిపూర్ణములకు గల తారతమ్యములను యించుక చూడదగును.

1) సుషుప్తియందు యెరుక బీజరూపంలో నుండి ప్రకటముగాక కారణ

రూపంలోనున్నది. కాని పరిపూర్ణ పరబ్రహ్మము నందు ఏ రూపంలోనూ (ఎరుకరూపంలోగాని మరుపురూపంలోగాని) యీషణ్మాత్రమూ లేదు.

2) యెరుక వుంటేనే, కర్త, కర్మక్రియలుండును. సుషుప్తియందు గుర్తెరిగి చేయబడు ఐచ్ఛికకర్మలు (Voluntary Acts) ఏమీ లేవుగాని, అనైచ్ఛిక కర్మలు (Involuntary Acts) అనగా హృదయ స్పందన రక్త ప్రసరణాదులు కలవు, ఏకర్మ వున్నప్పటికీ యెరుకవున్నట్లే కనుక సుషుప్తియందు ఎరుక వున్నట్లే కాని పరిపూర్ణమందు ఐచ్ఛిక, అనైచ్ఛిక కర్మలు ఎంతమాత్రము లేవు కర్త కారయితాలేడు.

3) సుషుప్తి ఒక అవస్తమాత్రమే, అవస్త అనగా నొక తాత్కాలిక స్తితిమాత్రమే. స్తితిభేదమును బట్టియే అవస్తల పేర్లున్ను మారుచున్నవి. అవస్తలయందు ఏకస్తితిలేదు. ఒక స్తితినుండి మరొక స్తితికి ప్రయాణము (నడక, గతి) చేయు చున్నది. పరిపూర్ణమునకు యిట్టి దుర్గతిలేదు. యెల్లపుడు ఏకస్తితియే, కనుక దాన్కి స్తితీగతీ అని రెండూలేవు.

కనుక సుషుప్తి దృష్టాంతము పరిపూర్ణమునకు నిజంగా చెప్పకూడదు. కాని బోధార్థము మాత్రమే గ్రహింపబడినది, సృష్టిలోగల యేవస్తువున్ను మరొక వస్తువుకు దృష్టాంతము చెప్పరాదు. ఏలననగా దృష్టాంతమునకు రెండు వస్తువులుండ వలెనుగదా! రెండు వస్తువులుండాలి. అంటే, బేధముంటేగాని రెండువస్తువులుండవు. రెండువస్తువులుంటేగాని భేదముండదు. కనుక అన్ని అంశములలోనూ పోలికవుండురెండు వస్తువు లెప్పుడును యుండజాలవు. గనుక యేవిషయములో, లేక అంశములో, దృష్టాంతము చెప్పబడినదో ఆ అంశముమాత్రమే గ్రహించవలెను.

సుషుప్తియందు తాత్కాలికముగా యెరుకలేదు. పరిపూర్ణమునందు ఎప్పుడూ ఏ రూపంలోనూ యెరుక లేదు. ఎరుక లేకపోవుట అనే అంశములో మాత్రం దృష్టాంతం సరిపోవు చున్నది. భేదములగూర్చి ఆలోచించరాదు.

"తద్వత్సచాపియస్యాస్తి" అనగా యెవనికి, పరిపూర్ణము నందు యెరుక ఎల్లపుడు లేనేలేదని ఆరూఢమగునో అని అర్థము "ప్రపంచం నాస్తితస్యవై" అనగా వానికి ప్రపంచములేదు అని అర్థము సచ్చిదానంద స్వరూపుడవగు అఖండ యెరుకవు నీవు నీవేలేనపుడు నీయందు తోచబడిన ప్రపంచమునకు వునికి చెప్పుటయెట్లు? కనుకనే, శ్రీ కృష్ణదేశి కేంద్రులు "నీవున్న చోట నుండును. నీవివిధ విచిత్రజగము నీతో గూడన్! నీవులేనట్టి చోటను నీ వివిధ విచిత్ర జగము నిలువదు కుర్రా" అని కందపద్యములో వుటంకించినారు.

9. శ్లో॥ యధానాహం, తథాశుద్ధం, తస్మాచ్ఛుద్ధేవ నిర్ణయః
జగదస్తీతికోవేద, నాస్తికోనచ నిర్ణయః ॥

తాత్పర్యము : "నేను" లేకుండావుంటే యెట్లుండునో, అట్లే శుద్ధమైన పరిపూర్ణ పరబ్రహ్మముండును. "నేను" లేకుండుట చేతనే అది "శుద్ధం" అని నిర్ణయించబడినది. "నేను" లేనిచో జగుత్తు వున్నదని తెలుసుకొనేవారెవరు? నాస్తికులు (అనగా గురు, వేద, శాస్త్రాదులయందు ప్రమాణబుద్ధి లేనివారు) గాని, యే నిర్ణయములుగాని, వుండుటయన్ను పొసగదు అని యీ శ్లోకతాత్పర్యము

"నేను అనగా ఏది? అను వస్తునిర్ణయ జ్ఞానము ముందుగా కలుగవలసి వున్నది. వైఖరీ వాక్కుగల మానవోపాధి యందున్న ప్రతివ్యక్తి "నేను" అని తనను గురించి పల్కు చున్నాడు. మాటలు వచ్చినది మొదలు, ఆబాల గోపాలము మరణము సిద్ధించు వరకు లింగ వయోబేధములు లేక నేను, నేను, అంటూ పల్కుచుండుటచే దీనిని వైయ్యాకరణులు (వ్యాకరణ వేత్తలు) సర్వ నామములలో ప్రథమ స్థానమిచ్చినారు సర్వనామమనగా సర్వమానవులకూ వర్తించు పేరు.

వాక్కు వైఖరీ రూపంలో మానవులయందున్నది. గనుకనే 'నేను' అను శబ్దమును వాగింద్రయముద్వారా పల్కుచున్నారు. ఆ వాక్కే మధ్యమా పేరుతో పశు పక్షుల యందున్నూ వుండి అ వ్యక్త శబ్దములచే తమ భావమును, కనీసం స్వజాతి ప్రాణులకైననూ తెలియచేయ గల్గుచున్నవి తరులతా గుల్మాదులయందీ వాక్కు యింకను సూక్ష్మమై తమ శరీర రక్షణకై తగు దిశను అన్వేషించి ఆ దిశలో వ్యాపించుచుండును. యీ తెలివే పశ్యంతీవాక్కు అని పిలవబడుచున్నది. పాషాణాదులయందు యీ తెలివి మరుపు రూపంలో నుండి శక్తి రూపంలో గుప్తమై (మరుగై) వున్నది. దీనినే సామాన్య జ్ఞానమని కూడ నందురు. ఈ తెలివి సామాన్యముగా నున్ననూ, లేక మానవోపాధియందు వలె విశేషముగా నున్నను లేక పరా, పశ్యంతి మధ్యమ, వైఖరీ వాగ్రూపములుగా ప్రకాశించిననూ యీ జ్ఞానము చరా, చర రూపములగు సర్వోపాధులయందునూ జడ చేతనములయందునూ వేయేల, సమస్తమునందునూ తెలివి రూపముగనో, శక్తి రూపముగనో, గుణరూపముగనో వుండియే యున్నది. మహావాక్యములలో దీనినే ప్రజ్ఞానమనీ, అహం పదార్థమనీ, త్వంపదమనీ, అయమాత్మయనీ, సృష్టికి పూర్వము బ్రహ్మమనీ తత్పదమనీ, వివిధనామములతో అభివర్ణింపబడినది.

మానవోపాధియందు గల యీ 'నేను'ను మరికొంచము వివరించుట అప్రస్తుతము కాదు. నేను పొడగరిని, బలిష్ఠుడను, నల్లటివాడను మొదలగు వాక్యములలో తాముస్థూల శరీరముతో తాదాత్మ్యము జెంది తద్ధర్మములు ఆత్మయొక్క (నేనుయొక్క) ధర్మములుగా భావించి పల్కినట్లైనది. నేను సుఖంగా నున్నాను. నేను గొప్ప దుఃఖములో నున్నాను. అను వాక్యములలో మనస్సుతో (సూక్ష్మశరీరముతో) తాను తాదాత్మ్యము జెంది మనోధర్మములగు శోకమోహములు, లేక సుఖదుఃఖములు ఆత్మయందు (నేనుయందు) అధ్యస్తము చేయుచున్నాడు. అట్లే ప్రాణముతో (కారణ శరీరంతో) తాదాత్మ్యము చెంది 'నాహమజ్ఞాశిషం' (అనగా నాకేమియు తెలియదు) అంటూ జడమగు ప్రాణలక్షణమగు అజ్ఞానమును ఆత్మ యందు (నేను యందు) ఆరోపించుచున్నాడు.

'అహంబ్రహ్మాస్మి', 'సోహం', 'శివోహం' యిత్యాది వాక్యములలో మహాకారణ శరీరము (ప్రత్యగాత్మ)తో తాదాత్మము చెంది సత్యమునకు చేరువైనాడు. కనుక మానవోపాధి యందలి నాల్గు శరీరములు, అట్లే ఈశ్వర తనువులునూ అన్నియు నేను అను దానియందు చేరుచున్నవి. సమస్తోపాధులయందీ నాల్గు శరీరములనూ వున్నవి. కనుక 'నేను' (గుర్తిరిగే తెలివి. (Consciousness) సర్వ భూతములయందునూ, ఎరుక రూపంగానో లేక మరుపు రూపంగానో వుండియే యున్నది. సృష్టికిపూర్వం నిజరూపంలో (Original state) వున్నది ఇది. ఇదియే స్వస్వరూపము. ఇది యింద్రియగోచరము కాకున్నను పంచేంద్రియ గోచరమగు సమస్తమూ దాని మారురూపములే కనుక ఆ 'నేను' (ఆత్మ) కానిది ఏమీ లేదు. కనుకనే 'ఆత్మనోన్యం నకించన' అని శ్రుతియున్నూ పల్కినది. ఇది శుద్ధమనస్సునకు అనగా విషయగ్రహణము చేయకయుండు నిరీంద్రియ మనస్సునకు అపరోక్షమగును. "మనసైవాను ద్రష్టవ్యం" అని శ్రుతి, అవచ్ఛిన్న తైలధారవలె మనస్సు ఆత్మయందు ఏకాగ్రత చెందినపుడు అమనస్సు ఆత్మరూపమే చెందుచున్నది. ఇదియే అపరోక్ష సాక్షాత్కారము. ఇదియే సచ్చిదానందము లేక అధిష్ఠానచేతన బ్రహ్మము.

పై భ్రాంతిరహిత శ్లోకములో చెప్పబడిన అహంపదార్థము (ఆత్మ) లేకపోయినపుడు ఏమివుండును? శూన్యమే వుండునని కొందరు జవాబు చెప్పవచ్చును. కాని శూన్యమని చెప్పువాడు అపుడున్నాడా? లేడుగదా! అపుడు శూన్యమే వున్నదో, పూర్ణమేవున్నదో చెప్పరాదు. అపుడున్నదేదో అది అవాంగ్మానస గోచరమైనది. జ్ఞాతృజ్ఞానజ్ఞేయాది సర్వత్రిపుటులు లేనిది కనుక అదిశుద్ధమైనది అని వ్యవహారార్థము చెప్పవచ్చును. "అహం" పదార్థము ('అహం') అను పదముచే చెప్పబడువస్తువు. లేక ఆత్మ) లేకుండా పోతే యెట్లుండునో శుద్ధము (పరిపూర్ణ పరబ్రహ్మము) ఆ విధంగా నుండునని శ్లోక మభివర్ణించుచున్నది. ఆత్మకూడా దానియందు లేదు కనుకనే అది శుద్ధమని, స్వచ్ఛమని, కేవలమని, సార్థకనామముతో దానిని వర్ణించిరి.

'పరిపూర్ణములో దోచిన యెరుకే కల' అన్నారు శ్రీకృష్ణ దేశికేంద్రులవారు, ఆ "యెరుక అను కలలో, పురుషుని కేరుకే యీ విశ్వమగుచు నేర్పడు కలగా" అనిన్ని అంటూ ఎరుక విశ్వములు యెట్లుదోచెనో, తమ కందార్థములలో చెప్పి యున్నారు. 'అహం' అహం అను శబ్దముచే చెప్పబడిన ఆత్మవస్తువే యీ యెరుక అనేకల, ఆకలలో పురుషునికి కలరూపంగా దోచబడినదే యీ విశ్వము. యిట్టి యెరుక విశ్వములతో గూడిన జగత్తు సత్యముగా వున్నదని చెప్పుటకు యెవ్వరు సాహసింపగలరు? నిరంతరం మార్పుచెందుచుండేది శాశ్వతమా? గురు, వేద, శాస్త్రాదులయందు యెట్టి విశ్వాసము లేనివారు నాస్తికులు. వివిధ నిర్ణయములతో గూడినవి మతవాదములు, అహమే లేకపోవుటచే, శుద్ధమని కీర్తింపబడిన పరిపూర్ణ పరబ్రహ్మమునందు, ఆస్తికులుగాని, నాస్తికులుగాని, మతవాదులుగాని, వారి నిర్ణయములుగాని, ఎమియు లేనేలేవని యీ భ్రాంతిరహిత శ్లోకములో వుద్ఘాటింపబడినది.

గురుగోప్యముకానంతవరకు 'నేను' లేని శుద్ధ వస్తువును వివరించినాము. గురుగోప్యము కూడా తెలియగోరువారు, గురుపాదము లాశ్రాయించి తెలుసుకొనవలసినదే, ఏలయనగా అది శిష్యుడు తన గురుముఖత, తెలుసుకొనదగ్గసదే.

'లేకుండపోతే' అంటే అర్థమేమి? విచారణ చేత, అనగా శాస్త్రప్రమాణమూ, గురువాక్యమూ, అనుభవమూ, యుక్తి మొదలగువానిచే, పరిపూర్ణ పరబ్రహ్మమునందు, యీ అహం పదార్థము లేనేలేదని ఆరూఢపరుచుకొంటే అని అర్థము, అంతే గాని తానువుండి యీవిశ్వమూ, విశ్వకారణమైన "అహం" అనే యెరుక అదృశ్యమైపోతే అని అర్థం కాదు. యెండమావులుండగానే అనగా చూపులకు అందుజలము గానవస్తూవున్నను, అచట ఒక్కచుక్కైననూ నీరులేనేలేదని, నిశ్చయ జ్ఞానము కల్గినట్లు. ఎరుక వుండంగానే ఎరుక విశ్వమును లేనే లేవని ఆరూఢమైనచో, అని మాత్రమే అర్థము. ఇట్టి ఆరూఢత సిద్ధించినచో ఏమిజరుగును? సర్వభయభ్రాంతులూ సర్వసంశయములూ రహితం కాగలవు.

జనన మరణరాహిత్యమే మోక్షము కాని, ఆత్మసాక్షాత్కారమే, మోక్షముగాదు. స్వస్వరూపజ్ఞానమే మోక్షముగాదు. జనన మరణములు పొందువాడు, లేక, కర్తఎవరు? పొందింపచేయు కారయిత ఎవరు? వీరిర్వురూ భిన్నులా? అభిన్నులా? సృష్టికి పూర్వమున్నదే సృష్టికారణము - కర్త, కారయితా రెండూ అదే, పూర్ణనాభి (సాలెపురుగు అని యితరులూ, పట్టుపురుగు అని పూర్ణభావజ్ఞులు అర్థము చెప్తారు) వలె అది అభిన్ననిమిత్తోపాదాన కారణమైయున్నది. దాని గురించి శ్రీకృష్ణదేశికేంద్రులు తమ కందార్థములో "అన్నియు తానై తనకవి పన్నుగ వేరనుచు నోటంబల్కుచు, మరి తానన్నిటి యెరిగే యరుకై వున్నానని ఎరుక కెరుకే నూహింపు చుండూ, తనలో తానే మోహింపుచుండూ" XXX అంటూ వివరించినారు. కనుక జనన మరణముల పొందుటకూ పొందించుటకూ, అత్యంత మూలకారణమై యున్నదీ యెరుకే: యీ అధిష్టానచేతన బ్రహ్మమే; లేక ఈ అహంపదార్థమే, ఈ మూల కారణము, సత్యము నిత్యము అదే మోక్షస్థానము అంతకంటే యేమీలేదు అనుకొన్నవార్కి ఆ యెరుక యొక్క పరిణామ రూపమగు సృష్టియు ఆ సృష్టియందుగల తన యుపాధిన్ని సత్యములు, నిత్యములు, కావలసివచ్చును. ఇక జన్మ మరణ రాహిత్యమనునది కలలోని వార్తయే యగును. ఊర్ణనాభియున్నంతవరకూ అది దారమును సృష్టించుచునే వుండును. మరల హరించుచునే వుండును. అది దానికి సహజము. స్వభావమూనై వున్నట్లే, సర్వమునకూ, సర్వములో చేరియున్న తన వ్యష్ట్యుపాధికి అత్యంత మూలకారణమగు యెరుక (అహం పదార్థము) సత్యమని భ్రాంతి యున్నంతవరకు జనన మరణ రహితంకాదు. పరిపూర్ణ పరబ్రహ్మమునందు యెరుకకు స్థానముగాని మూలముగాని వున్నదనే భ్రాంతి యున్నంతవరకు జర్మరహితంకాదు. ఎరుకేభ్రాంతి, "భ్రాంతిరహిత మిదం మోక్షం" అన్నారు పెద్దలు పరిపూర్ణ పరబ్రహ్మమునందు ఎరుక పుట్టనే లేదు. అని క్షణమైన మరువక వుండమన్నారు అచల ఋషులు.

కనుక ఎరుక లేనేలేదని ఆరూఢులై యున్నవార్కి అనగా నేనులేకుండాపోయినవార్కి జన్మరాహిత్యం కరతలా మలకము, అంతేగాక వారికి ఎట్టికోరికలుండవు కనుక క్రోధాదులున్ను వుపశమించును. వారికి కామ్యంబుద్ధిగాని కర్తృత్వబుద్ధి గాని యుండదు. రాగద్వేషములు సుఖ దుఃఖములు పాపపుణ్యసంస్కారములు వారి అంతఃకరణయందు అంటజాలవు.

సభాసదుల నుద్దేశించి నిండు సభలో మీ రెవవైనా మోక్షమునకు పోగలరా?" అని శ్రీకృష్ణదేవరాయలు ప్రశ్నించగా ఎవరున్నూ బదులుచెప్ప సాహసించలేదు. కాని, తెనాలి రామకృష్ణుడు మాత్రం, లేచినిలబడి "నేనుపోతే పోవచ్చును" అని సమాధానమిడెనట. ఇంతసాహస మీతనికెట్లు వచ్చెనాయని అందరబ్బురపడు చుండిరి, కాని నేనుపోతే అనిరెండు మాటలను చేర్చి చదువుకొని రాజు అందలి అర్థగాంభీర్యమునకు ముగ్ధుడయ్యేనట.

అట్లే అంగ్లమునందొకే చమత్కార వాక్యములో ప్రశ్నోత్తరములురెండున్నూ యిమిడియున్నవి. When shall I cease to be? (అనగా నేనెప్పుడు లేకుండాపోతాను (అంటే, నాకు జన్మరాహిత్య మెప్పుడగును?) అనే ప్రశ్నకు ఆమాటలే కొద్దిగా క్రమంమార్చితే When I shall cease to be అగును. అంటే నేను అనేది లేకుండా పోయినపుడు నేను జన్మరహితం చెందుతాను అను అర్థము సిద్ధించును.

ఈ శ్లోకమునందుగల 'అహం' "శుద్ధం" అను శబ్దములకు సూటిగా అర్థం చెప్పాలంటే అహమే యెరుక, శుద్ధమే పరిపూర్ణం అనాలి.

"అహం" అను శబ్దమునకు "నేను" అని అర్థము. ఈ 'నేను' స్థూలసూక్ష్మ కారణమహా కారణ శరీరములలో సందర్భమునుబట్టి దేనికైనను వర్తించగలదని తెలుసుకొంటిమి. అంతేగాక కారణబ్రహ్మమే జగజ్జీవేశ్వర రూపంగా మార్పుచెందినది. కనుక సర్వమూ ఆత్మమయమే అనిన్నీ "నేను" యొక్క నిజస్వరూపము ఆకారణ బ్రహ్మమే అనిన్నీ కనుక అదే అహం పదార్థము యనిన్నీ అఖండ ఎరుక అనిన్నీ కూడా గమనించవలెను. ఈ అహం పదార్థములేనిచో ఏముండును? మహాపరిశుద్ధమైన పరిపూర్ణ పరబ్రహ్మమే (Absolute Brahmam) యుండునని ఈ శ్లోకముద్ఘాటించుచున్నది. ఆ పరిపూర్ణ పరబ్రహ్మమునందు యితరమేమిన్నీ కొంచమైననూ లేదు. కనుక అది మహాపరిశుద్ధము. అది దోషరహితము "నిర్దోషంహిసమం బ్రహ్మం" దోషరిహితమైనదే నిజమగు బ్రహ్మము. దాని యందు సర్వ దోషములకు అత్యంతమూల కారణమగు అఖండ యెరుకేలేదు. కనుక జగత్తు వున్నదనిగాని, లేదనిగాని ఎవరు తెలుసుకోగలరు? ఎవరు చెప్పగలరు? లేనేలేదని చెప్పే నాస్తికులు మాత్రముందురా?

సిద్ధాంత రాద్ధాంత నిర్ణయము మాత్ర ముండునా? "నిర్ణయోనాస్తి సర్వదా" అని చెప్పబడుతోంది. పరిపూర్ణ పరబ్రహ్మమును గూర్చి (అదిమనోవాక్కుల కందరానిదికనుక) నిర్ణయించుటే మహాపాపమని శ్రీ శివరామ దీక్షితులువారు సెలవిచ్చినారు.

10. శ్లో॥ ఆత్మతీతం కేవలాత్మ దేహెనాస్తి కదాచన
ఆస్తినా స్తితి కోవేద నిర్ణయోనాస్తి సర్వదా ॥

అని భ్రాంతిరహిత శ్లోకములలో యొకశ్లోక ముద్ఘాటించుచున్నది.

ఆత్మకతీతమై, విలక్షణమై, కేవలాత్మ (పరిపూర్ణ పరబ్రహ్మ) మొప్పుచున్నది. శరీరాత్మలతో కూడిన దేహమెప్పుడును లేనేలేదు కనుక వున్నదనిగాని, లేదనిగాని తెలుసుకొనుటకు ఎవరున్నారు? ఎప్పుడూ ఏనిర్ణయములూ లేనేలేవు. అని ఈ శ్లోకముయొక్క తాత్పర్యము

ఆత్మయనగానేమి? సకలప్రాణులయందు, వస్తువులయందు, బాహ్యాభ్యంతర భేదము లేకుండా వ్యాపించియున్నది. అని వుత్పత్త్యర్థము. ఆత్మ, బ్రహ్మ, అని రెండు శబ్దాలచే వ్యవహరింపబడు వస్తు వొక్కటియేగాని వేరుగాదని మహావాక్యవిచారణలో స్పష్టముగా వివరింపబడినది. అగుచో రెండుశబ్దములేల? సృష్టికి పూర్వమచలస్థితిలో నుండి నిస్సంకల్పస్థితిలో నున్నపుడు బ్రహ్మమని అన్నారు. దానికి చలనముకల్గి, అనగా అహం స్ఫురణ ఏర్పడి "సొఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి" అనగా నేననేకమగుదునని అదికోరుకొని జగద్రూప పరిణామముచెంది "తత్సృష్ట్వాతదేవాను ప్రావిశత్" అనగా, సృష్టించిన వానియందు తానే జీవరూపంగానో, లేక తెలివిరూపంగానో, లేక శక్తి రూపంగానో, లేక గుణరూపంగానో, అను ప్రవేశముగావించినప్పుడు ఆత్మయని, ఆబ్రహ్మమునకే మరొక నామకరణము చేయబడినది. 'ఆకాశ శ్శరీరం బ్రహ్మ" యని శ్రుతి చెప్పుచున్నపుడు యీ బ్రహ్మము నిరావరణ రూపమనదగునా! కానేకాదు. ఏలననగా సృష్టిరూపందాల్చు అపరిమిత సంకల్పశక్తి ఆ బ్రహ్మమునందే బీజరూపంగానుండి, ఆవరణాత్మకమైన ఆకాశాది భూతములుగా పరిణమించి ఈశ్వర జీవజగత్తులుగా విజృంభించెనని చెప్పితీరవలసిందే, అంటే తొలుత చిద్ఘన స్థితిలో నున్న బ్రహ్మకు, తనయందు నిగూఢంగానున్న త్రిగుణాత్మిక శక్తిచే శరీరాత్మలుగా ద్వయదోష దూషిత మాయెను, అంటే సృష్టికి పూర్వము చిద్ఘనమైయున్నపుడు బ్రహ్మమనీ, సర్వశరీరస్థ చైతన్యమైయున్నపుడు ఆత్మయనీ పేరొందెననీ గ్రహింపనగును.

కనుక యిపుడాత్మాతీతమైన దేది? పైన వివరించిన బ్రహ్మపదార్థమును ఆత్మాతీతమైన వస్తువనదగునా? అనరాదు ఏలననగా ఆ బ్రహ్మముయొక్క మారురూపమే యీ సర్వశరీరస్థ చైతన్యమగు ఆత్మయైయున్నది, అతీతమనగా ఆత్మనుదాటి, లేక అతిక్రమించియున్నదని యర్థము. ఆత్మగానిది ఏకొంచెము ఆత్మతో సంబంధపడనది, ఆత్మలోలేనిది, ఆత్మయొక్క పూర్వాపర రూపములుగానిది, ఆత్మకు సంపూర్ణంగా విలక్షణమైనది, యగు వస్తువేదో దానినే ఆత్మాతీతమగు వస్తువనదగుగాని, ఆత్మయొక్క తొలిరూపమగు, లేక పూర్వరూపమగు బ్రహ్మమును, ఆత్మాతీతమని యనరాదు. ఆత్మాతీతమనగా, ఆత్మకు పైన యెక్కడో వున్నదని అనరాదు. ఆత్మకానిదానికి అనాత్మయని పేరుపెట్టారు. కాని అనాత్మ అంటూ ఒకటుంటేగదా!

ఆత్మనోన్యం నకించన" అంటూన్నది శ్రుతి. కనుక ఆత్మానాత్మలు రెండూ నాత్మయే. ఆత్మానాత్మలుగా గానవచ్చేది ఒక ఆత్మయే. ఎరుక మరుపులు రెండూ యెరుకే అన్నారు పూర్ణభావజ్ఞులు. కనుక ఆత్మాతీతమంటే ఆత్మానాత్మలుగా గానవచ్చే ఎరుక కతీతమన్నమాట. దేనికతీతమో దానికంటే యుత్తమము, యుత్కృష్టము, శ్రేష్ఠము అగువస్తువేదో యగునేకాని, దానికంటె నికృష్టమూ, నీచమూఅగునది, అథవా, సమానమైనదీ కాజాలదు.

దేనికతీతము? అంటే, శబ్దాదివిషయములతో సంయోగము చెందు యింద్రియములకు, అయింద్రియములద్వారా వర్తించు మనస్సుకు, ఆ మనస్సునకు సత్తాయిచ్చు ప్రత్యగాత్మకు దానికభిన్నమగు, అఖండ చిద్ఘనమూర్తి యగు పరమాత్మకు గూడా తెలియరాక మనోవాగ్గోచరమైనదిగాక యున్నదని యర్థము. దేనికీ అవిజ్ఞేయమై పంచతన్మాత్రలూ లేశమైననూ తనయందు లేక, సర్వలక్షణ విలక్షణయైయున్న పరిపూర్ణ పరబ్రహ్మమునకే అతీతమను మాట వర్తించును కాని సృష్టికారణమైన బ్రహ్మమున కామాట వర్తించజాలదు.

ఆ పరిపూర్ణ బ్రహ్మమే కేవలాత్మశబ్దముచే ఈ శ్లోకము నందుద్దేశింపబడినది. పరిపూర్ణ పరబ్రహ్మమే కేవలంగానున్నది. కేవలం అనే మాట తానుతప్ప, తదితరమేదియు తనయందు గాని తనకు వేరుగాగాని యీషణ్మాత్రమూలేకుండా, బాహ్యాభ్యంతరభేదమేమీ లేకుండా సంపూర్ణముగానిండియున్న పరిపూర్ణమునకే తప్ప మరి దేనికీ వర్తింపజాలదు. కారణ బ్రహ్మమునందు మాత్రము యితరమైనదేమైనయున్నదా? అది సజాతీయ విజాతీయ స్వగత భేదములు లేనిదని వర్ణింపబడలేదా? అని శంకింపరాదు. ఆవర్ణన పరిపూర్ణ బ్రహ్మమునకే వర్తించును. కారణ బ్రహ్మమునందు సజాతీయ విజాతీయ భేదములు లేవేమోగాని, స్వగత భేదము లేదనియనరాదు. కార్యలక్షణములన్నియు కారణ వస్తువునందుండి తీరవలసినదేగదా! వృక్షము నందలి స్వగత భేదములగు కాండము శాఖోపశాఖలు పత్రపుష్పఫలాదులు అన్నియు బీజరూపంగా విత్తనమునందున్నూ నెమలి పింఛము నందలి చిత్రాతి చిత్ర విచిత్రవర్ణములన్నియు మయూరాండమునందలి శుద్ధ రసమునందను వున్నట్లు చెప్పి తీరవలసిందేగదా! అట్లే సృష్టి విచిత్రములు వానివైవిధ్యము నానాత్వము. అంతయూ కారణ బ్రహ్మమునందు సూక్ష్మంగా దాగియున్నట్లేగదా! త్రిగుణములు, పంచతన్మాత్రలు, జీవుల కర్మసంస్కారములు, అఖిలాండకోటి బ్రహ్మాండములు, సర్వప్రాణులు, ఆపరమాత్మయందే సృష్టికి పూర్వం గర్భీకృతమై యున్నట్లే కనుక కారణ బ్రహ్మమునందు స్వగత భేదములేనేలేదని చెప్పరాదు. కనుక దానిని కేవలంగాని కేవలాత్మయనిగాని యనరాదు.

ఈ భేద అభేదరూపమై ఖండా ఖండములగ గనవచ్చే ఎరుక (పరమాత్మ) కేవలాత్మకాదు. ఈ ఆత్మవేనియందు లేదో అది కేవలాత్మ "ఆత్మేతిశబ్దహీనోయ మాత్మశబ్దార్థ వర్జితః సచ్చిదానంద హీనోయం" అని తేజోబిందూపనిషత్ చెప్పుచున్నది. సృష్టికారణ వస్తువునకు ఆత్మ, పరమాత్మ, బ్రహ్మము, పరబ్రహ్మము అని పేర్లు పెడితే దానికతీతమగు

దానికి పరిపూర్ణబ్రహ్మములేక, కేవలాత్మ (Absolute Brahmam) అని వ్యవహారార్థము పేర్లు పెట్టుట జరిగినది. కేవలాత్మమహా పరిశుద్ధమైనది. "నేహనానాస్తికించన" అందునా నాత్వము కొంచమైనా లేదు. ॥యత్రనాన్యత్పశ్యతి, నావ్యచ్ఛృణోతి, నాన్యద్విజానాంతి సభూమా' ' అనగా, ఎక్కడ అన్యమేమియు, చూడబడదో, వినబడదో తెలియబడదో అదే గొప్ప వస్తువు దానిని ఆశ్రుతి భూమాశబ్దముచే వాడినది. ఈ శ్రుత్యర్థము కేవలాత్మనే అనువదించుచున్నది. జ్ఞాతవ్య లక్షణములందు లేవు. జ్ఞాతృజ్ఞానజ్ఞేయములు (ఎరుకలక్షణములు) ఏమియు అందులేవు. ఎరుకలేని చొక్క పరిపూర్ణ బ్రహ్మము మాత్రమే, అందు యెరుకయెన్నడూ లేనేలేదు. వుండుటకు స్థానముగాని ఆయేరుక పుట్టుటకు మూలముగాని మరియొకటి లేనేలేదు. తెలుసుకొనే తెలివియే లేనపుడు. తెలివినికల్గియున్న వ్యక్తు లెవరుండగలరు?

తెలివివుండుటకు స్థానముగాని మూలంగాని పరిపూర్ణము నందు లేనేలేవంటే ఆ యెరుకయు దాని ఆవరణమగు శరీరము యెట్లు గాన వచ్చుచున్నవి? అని యంటే ఎవరికి కానవచ్చు చున్నవి? అఖండ ఎరుకలేనపుడు ఆ అఖండమందేనుండు వారెవరనూ లేనేలేరుగదా! కనుక ఆయఖండ ఎరుకలేనే లేదు. ఎవరికిన్ని తోచనేలేదు అని, చెప్పితీరవలసినదే. తోచినచో ఎరుక కెరుకేతోచినది. "ప్రకటమగుబింబమందున, ముకురము ముకురస్తబింబములు లేవెపుడు XXX" అన్నారు. కృష్ణదేశికులు పరిపూర్ణబ్రహ్మమందు యెరుకగాని దాని శక్తిరూపమగు మాయగాని ఛాయా రూపమగు జగత్తుగాని లేనేలేవు. ప్రకటమగు బింబము పరిపూర్ణము, ముకురము ఎరుకయొక్క ఆవరణము, ముకురస్తము ఎరుక జగత్తు ఛాయా మాత్రమే అంటే, ఎట్లు సరిపోవును? ఛాయకో పొడుగు వెడల్పు మాత్రమే యున్నవి. కాని లావు, సన్నము, దళసరి మొదలగు మూడవకొల్త (Third Dimension) లేదుగదా! మరి జగత్తున మూడవకొల్త కూడా గానవచ్చుచున్నదిగదా! అని కొందరు శంకింపవచ్చును. కాని నేటి విజ్ఞాన వేత్తలు మూడు కొల్తలుగల సినీమాలకు కూడా తయారు చేయగల్గుచున్నారన్నపుడు యీ శంకకుతావులేదు. అంటే, ఎరుక తన ఆవరణయందు తానే ప్రతిబింబించి జీవేశ్వరజగత్తుగా రూపుదాల్చెనని ప్రతిబింబవాదరీత్యా కూడా సృష్టి కార్యమును కారణరూపముగల యెరుకగానే నిర్ణయించవచ్చును. "దేహోనాస్తిక దాచన" అనగా ఆకేవలాత్మకు దేహము లేదని, లేదా కేవలాత్మయందు దేహము లెకప్పుడును లేవనియును రెండు విధములుగా అర్థము చెప్పవచ్చును కేవలాత్మకు తెలివిలేదు గనుక ఆ తెలివికి ఆవరణమగు దేహములేదు. కనుక కేవలాత్మ విషయములో దేహీదేహముల ప్రసక్తియే లేదు. కనుగనే "ఆవరణము ఆకసము, నిరావరణ మచలమనుచు అనిరి మహాత్ముల్" అంటూ కృష్ణదేశికలు కందార్థములో శెలవిచ్చినారు. పరిపూర్ణ మొక్కటేసూదిమోపుటకైనా సంధి లేకుండా నిండియున్నపుడు, దేనిని యేది ఆవరించును?

ఆ కేవలాత్మయందు దేహీ దేహములతో కూడి ఎరుక రూపమగు బ్రహ్మముతోచినది. తెలవియే దేహి, దాని ఆవరణమే దేహము. "దేహికావర్ణమై దేహమాయెన"ని పెద్దలన్నారు.

"ఆకాశశ్శరీరం బ్రహ్మయని" శ్రుతియున్నూ పలుకుచున్నది. తీపిని ఆవరించి బెల్లమున్నట్లు తెలివిని ఆవరించి దేహమున్నది. బెల్లం లేకుంటే దానియందు తీపిన్నివుండజాలనట్లు, బెల్లంతోనే ఆ తీపియున్నూ పోయినట్లు, కేవలాత్మయందు దేహములేదని చెప్పబడినపుడు దేహియగు తెలివిన్ని లేదని చెప్పినట్లే, శ్రుత్యానుసారం ఆకాశమే బ్రహ్మమునకు శరీరమైతే, ఆకాశము, దానియందు దేహిరూపంగానున్న తెలివితో సహా లేనేలేదన్నమాట. "ఆకాశంగగనం శూన్యం" అని శ్రుతియున్ను పలుకుచున్నది. చిద్ఘనమని చెప్పబడుచున్న బ్రహ్మము దేహము లేకుండా వున్నదనీ, దానికి ఆవరణ రూపమగు దేహము వుండవలసినపనియే లేదనీ, యెవరేనా వాదింపబూనినచో, అట్టి వాదన "ఆకాశశ్సరీరం బ్రహ్మ" అని శ్రుత్యర్థమునకు విరుద్ధము. మరిన్ని ఆవరణములేని దాని కొకస్థానమంటూ అవసరంలేదు పరిపూర్ణమందు చోటున్నూలేదు మూలమున్నూ లేదు. కనుక ఎరుకపుట్టనేలేదని అసలు లేనే లేదని సిద్ధాంతము. ఐతే, "మేనెరుకల రెండింటిలో దానిని యిది. దీని నదియు తగసృజియించున్ XXX" అంటున్నారు గదా, కృష్ణదేశికేంద్రులు! ఎరుక అసలు లేనేలేదని అంటే యెట్లా? అని కొందరనవచ్చును. కాని ప్రత్యక్షముగా గానవచ్చు యెరుకలేనేలేదనీ, పుట్టనేలేదనీ, అంటేనమ్మజాలని మందామధ్యమాధికారులకొరకు అట్లు చెప్పినారని అనవలసి వున్నది. ఏలననగా "యెరుకపుట్టనేలేదు. అదియిదికాదు, యిదిఅదిగాదు" అని శ్రీ శివరామ దీక్షితులవారి సిద్ధాంతమై యున్నది. అనగా ఎరుకపుట్టనేలేదు. పుట్టని యెరుక నిత్యమూ సత్యమూ అయిన పరిపూర్ణము ఎట్లగును, కాజాలదు. నిత్యమూ సత్యమూ అయిన పరిపూర్ణము యెరుక కాజాలదు. కనుక యెరుక తన యందు గాని తన కన్యమైన పరిపూర్ణ పరబ్రహ్మము నందుగాని పుట్టనేలేదని చెప్పవలసినదే. పుట్టని యెరుక మరి యొకదాని పుట్టుకకు కారణమెట్లు కాగలదు? అట్లు చెప్పుట వంధ్యా పుత్రుడు శశశృంగాయుధము చేబూని గంధర్వనగరముపై దండెత్తి జయించినట్లు చెప్పుటవంటిదే యగును.

ఏ సిద్ధాంతము, లేక ఏ నిర్ణయంచేసినా, తెలివితో (యెరుకతో) చేయవలసినదే గదా! ఆ యెరుక లేనిదే అయితే ఆ యెరుకచేసిన నిర్ణయముల కూడా లేనివే కాగలవు. కనుక "నిర్ణయమే మహాపాపం" అన్నారు దీక్షితులవారు కం॥ ఏనిర్ణయమును చేయడు. నేనని మహాత్ముడెపుడు, నేననువాడే, నానా విదాల వదరును. నేనను తనవంటి వారినెప్పుడు గనినన్॥ అన్నారు కందపద్యములలో శ్రీ కృష్ణదేశికేంద్రులు. "నిర్ణయో నాస్తి సర్వదా" అని యీ శ్లోకంలో చెప్పబడినది. ఇది మాత్రమొక నిర్ణయం కాదా? అంటే; నిజమే- ఏ నిర్ణయం చేసినా మాటలతోనే గదా! నిశబ్ద శ్శబ్దములమీరిన, తన్మాత్రులు లేని, పరిపూర్ణ పరబ్రహ్మమును గూర్చి చెప్ప శబ్దములు లేక వైఖరీ వాక్కుకూ సమమగుమాటలు, ఏమి వుండగలవు? కనుకనే మాట మాయయనీ, గురుబోధ సహా వాగ్వ్యాపారమంతయు కలలోని ముచ్చట్లేనని శ్రీ కృష్ణదేశికేంద్రులు శెలవిచ్చినారు.

(11) 11. శ్లో॥ శాస్త్రజ్ఞానం జహుక్లేశం, బుద్ధేశ్చలన కారణం
ఉపదేశాద్ధరేర్బుధ్యారమతే సర్వకర్మశు ॥

తాత్పర్యము :- శాస్త్ర పఠనమువలన యేర్పడిన జ్ఞానమువలన కడతేరుట కష్టము. ఇదమిద్ధమను నిశ్చయ జ్ఞానము బుద్ధికి కలుగకపోగా సంశయాత్మకమై మనస్సు డోలాయమానమై దుఃఖ కారణమగును. కనుక గురూప దేశముపొంది, తద్వారా వస్తు నిశ్చయజ్ఞానముతో సకలకర్మలు చేసుకొనుచూ కృతార్థుడు కావలెను.

శాస్త్రమనగా శాసించునది, రక్షించునది అనివ్యుత్పత్త్యర్థము. "తస్మాత్ శాస్త్రం ప్రమాణంతే కార్యకార్య వివక్షితే" అని భగవద్గీత, కార్యములందు, అకార్యములందు అనగా విధి నిషేధములనుపాటించువట్ల శాస్త్రములను ప్రమాణముగా గైకొనవలసివున్నదని నిర్దేశించుచున్నది. కనుక శాస్త్రమనగా విధీ నిషేధములను ధర్మాధర్మములను, జీవిత విధానమును నిర్ణయించుచున్నది. వేదమే అట్టి శాస్త్రమని రూఢ్యార్థము. ఐనను శ్రుతిస్మృతులు, షట్శాస్త్రములు, భాగవతాది పురాణములు, ప్రవృత్తి, నివృత్తి కర్మలను బోధించు వాంఙ్మయ మంతయు శాస్త్రము అనుపేర జరుగు చున్నవి ఇట్టి వేదోక్త లేదా యితర శాస్త్రోక్త ధర్మములను పాటించి ధార్మిక జీవనము గడిపిన వాన్కి గల్గు ఫలమేమి? మోక్షమే చేకూరగలదు. కనుక శాస్త్రమును పాటించిన వానిని ఆ శాస్త్రము రక్షించునని చెప్పబడినది. జనన మరణ రూప సంసారముకంటె ఘోరవిపత్తుగాని, దాని నుండి రక్షింపబడుటకంటె గొప్ప రక్షణగాని లేదుగదా!

శాస్త్రాధ్యయనమువలన గలుగు జ్ఞానము యిట్టి రక్షణ నీయజాలదు. ఏలననగా "శ్రుత యశ్చభిన్నాః, స్మృత యశ్చ భిన్నాః మహాఋషీణాం మత యశ్చభిన్నాః XXX" శ్రుతులు పరస్పర భిన్నము స్మృతులున్ను పరస్పర భిన్నములై యున్నవి. మహాఋషుల అభిప్రాయములున్ను పరస్పర భిన్న భిన్నములై యున్నవి. అంతేకాదు; ఒకే శ్రుతికి భిన్న భిన్న భాష్యములు వ్రాసి మతకారులు భిన్నభిన్న మత సిద్ధాంతములకు కర్తలై ప్రచారము గావించియున్నారు. ఈ సిద్ధాంతములు మత కలహములకు దారితీసి, జిజ్ఞాసి లోకమును గందరగోళములో ముంచి సత్య సిద్ధాంతమునకు దూరస్తము గావించుచున్నది. ఈ మతవాదములలో ఏది గ్రాహ్యము? ఏది త్యాజ్యము? నిర్ణయించలేక తికమకపడి చివరకు కొంతలో కొంత తన బుద్ధికి సరిపోయినట్లున్న మతమును జిజ్ఞాసి స్వీకరించుచున్నాడు. లేదా తనతండ్రి, తాతముత్తాతలమతమునే గ్రుడ్డిగా అనుసరించుచున్నాడు.అంతటితో నాగక, ఆమత దురభిమానముతో అన్య మతములయందు ద్వేషమును పెంచుకొనుచున్నాడు. ఇంతకూ, ఆమతకారుని మతి (బుద్ధి) చేత నిర్ణయింపబడినదే ఆమతము, అని గుర్తెరుగక పోవుటయే యీ మత ద్వేషములకు మూలకారణము, అందుచేతనే, "మతము లందు ముక్తి వెదకిన లేదయా, విశ్వదాభిరామవినురవేమా" అని వేమన ప్రవచించినాడు. అట్లని మత నిర్ణయము లన్నియూ అసత్యములు కావు. అన్నియు సత్యములున్నూ కావు అర్ధ

సత్యములు, పాతిక సత్యము మాత్రమే అయివున్నవి. వాని యన్నింటి సమాహారమునందునూ, సమన్వయమునందునూ మాత్రమే పూర్ణ సత్యము గోచరించగలదు. మత నిర్ణయములు ఎట్లున్న వంటే గ్రుడ్డివాళ్ళు ఆరుగురు పోయి యేనుగుయొక్క వివిధావయవములలో ఒక్కొక్కరు ఒక్కొక్క అవయవమును చేతులతో తడిమి చూచి యేనుగుయొక్క స్వరూపమును తాము తడవిన యేకావయవమును పురస్కరించుకొని పరస్పరము నానిర్ణయమే సత్యమంటూ కలహించిన విధముగా నున్నవి.

శాస్త్రములనధ్యయనం చేసి శాస్త్రపాండిత్యము గడించినంత మాత్రముతో రక్షణ (జన్మ రాహిత్య రూపమోక్షము)ను ఎవరున్ను పొంద జాలరు. "వాగ్వైఖరీ, శబ్దఝరీ, శాస్త్ర వ్యాఖ్యాన కౌశలం" మాత్రమబ్బగలవు ఇట్టి పాండిత్యమువలన ధనకీర్తి ప్రతిష్ఠలు మాత్రమే పొందగలడు. ఇవన్నియు భుక్తికే గాని ముక్తి కేమాత్రం కొరగావని సురేశ్వరాచార్యులు సెలవిచ్చి యున్నారు. "నాయమాత్మా ప్రవచనేనలభ్యో, నమేధయా, నబహునాశ్రుతేన XXX" అంటూ కాఠకశ్రుతి ఘోషించుచున్నది. ప్రవచనములు (వుపన్యాసములు), బుద్ధి బలము, శ్రుతల అధ్యయనము మున్నగు వానివలన, ఆత్మోపలబ్ధి కాజాలదని తాత్పర్యము. ఇంతకూ ఆత్మస్వరూజ్ఞానము వలన తానెవరో మాత్రము తెలిసికొనగలడు. జన్మరాహిత్యము సిద్ధించవలెనన్న, తనకు మూలమైన వస్తువేదో, జన్మకారణమైన వస్తువేదో,దేని రహితమునందు జన్మరాహిత్యము సిద్ధించునో గుర్తెరిగి, ఆ పిమ్మట ఆ రాహిత్యస్తితి సాధించుట యెట్లో తెలుసుకొనవలసి వున్నది. పుట్టుచావులు లేని వస్తువేది? పుట్టి చచ్చే వస్తువేది? యీ రెంటిని వస్తు నిశ్చయ రూపంగా గుర్తెరిగి, పుట్టి చచ్చే వస్తువును మరల పుట్టకుండా చేయుటెట్లు? మొదలగు విషయములను తెలుసుకొనుట జన్మరాహిత్య రూపముగా మోక్షము (రక్షణ) నాసించువారి కర్తవ్యము అయి యున్నది, శాస్త్రము లెంతవరకు యీ అంశములను బోధించుచున్నవి? అంటే సూచన ప్రాయముగా మాత్రమే తెలియుచున్నవి గాని విపులముగా చెప్పలేదు. సద్గురువుల నాశ్రయించి సేవించి వారి కృపకు పాత్రులై వారిచే వుపదేశము పొంది గురూపదిష్ట మార్గమున పయనించి కృతార్థులు కండు. అని శాస్త్రములు హెచ్చరించుచున్నవి. "గురువు లేని విద్య కూడదెవ్వరికైన, శూలికైన తమ్మిచూలికైన" అనీ, "గురువు లేని విద్య గ్రుడ్డివిద్య" యనీ, గురోర్ముఖేన జ్ఞాతంవ్యం నాన్యధా గ్రంథకోటిభిః" అనీ మరెన్నో రీతుల పెద్దలుద్ఘాటించు చున్నారు. "ఉపదేక్ష్యంతితే జ్ఞానం జ్ఞానినాం తత్వదర్శినః" అని భగవద్గీత పల్కుచున్నది. తత్వదర్శికులైన జ్ఞానులు, జ్ఞానమును వుపదేశింతురు. అని అర్థము. జ్ఞానమనగా శాస్త్రాధ్యయనమువలన లభించిన తెల్వికాదు: (చిద్ఘనమైన) ప్రజ్ఞాన ఘనమై యున్న పరమాత్మవస్తు తత్వము ఆ వస్తువును సాక్షాత్కరించుకొన్నవారు కనుకనే తత్వదర్శునులని కొనియాడబడినారు. వారాతత్వమును గూర్చి పరోక్ష జ్ఞానమును అనగా వినకిడిచే, లేక శాస్త్రములు అధ్యయనము చేయుటచే (అంటే విని, లేక చదివి) ఏదో వూహామాత్రజ్ఞానము సంపాదించినవారుగారు ఆ తత్వ స్వరూపులై అపరోక్ష జ్ఞానము ప్రాప్తింపచేసుకొన్న

ఘనులువారు. వారు కేవలం విన్నవారు మాత్రమేకాదు. కన్నవారు కూడాను కనుకనే శిష్యులకు (వివేకానందునికి రామకృష్ణ పరమహంసవలె) అ తత్వమును సాక్షాత్కరింపచేయగలరు. ఉపదేశమనగా, ఆ తత్వమును శిష్యుని కట్టెదుటకు తెచ్చుట: లేక శిష్యుని అ తత్వమువద్దకు చేర్చుట అని అర్థము కాని, శిష్యుని చెవిలో యేదో మంత్రమును మరొకర్కి వినబడకుండా చెప్పుట మాత్రమే కాదు. తత్వజ్ఞానార్థ దర్శనమే జ్ఞానమని భగవద్గీత మరొకచోట జ్ఞానశబ్ద నిర్వచనము చేసినది (గీత - 13-11) అంతకుముందు 7లగాయిత 11 వరకుగల శ్లోకములలో అమానిత్వము, అదంభిత్వము, అహింసాస్వభావము, ఓర్పు, సత్రువర్తనము, గురుసేవ, అంతర్బాహ్యశౌచము చిత్తస్థైర్యము యింద్రియ నిగ్రహము, విషయవిరక్తి, నిరహంకారము, జన్మ మృత్యు జరావ్యాధుల యందు దుఃఖమున్నదని గ్రహించుట, పుత్రాదుల యందు ప్రీతి లేకుండుట, నిస్సంగము, యిష్టానిష్టములు సంప్రాప్తించినపుడు సమత్వము, నాయందు (గురుని యందు) అనన్య భక్తి, ఏకాంతవాసము, జనసమూహము, సంసర్గము నందు అప్రియత్వము, ఆత్మజ్ఞాన నిశ్చయము తత్వజ్ఞానముచే ఆత్మవస్తు నిశ్చయము గల్గియుండుట, యివన్నియు జ్ఞాన లక్షణములనిన్ని యితర మంతయు అజ్ఞానమనిన్ని గీత నిర్ణయించినది. యీ లక్షణములన్నియు కల్గియున్నవాడే జ్ఞానిఅనిన్ని 'సర్వభూతస్థమాత్మానం, సర్వభూతా నిచాత్మని ఈ క్షతేయోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శినః'' (6-29 గీత) అనగా తనయందు సర్వభూతములు, సర్వభూతముల యందు తాను, వున్నట్లుగా చూడగల్గినవాడే యోగియనీ జ్ఞానియనీ చెప్పదగును. ఈ అమానిత్వాది సద్గుణ సంపత్తి కల్గుటకే సాధనయవసరము? అన్నచో ఒక్క హరిభక్తి సంపూర్ణంగా యన్న ప్రహ్లాదునికి "సద్గుణంబులెల్ల సంఘంబులై వచ్చి అసుర బాలకు నందు నలముకొనియే'' అని బమ్మెర పోతన్నగారు వ్రాసినట్లుగానే, ఏ సాధనలు లేకుండానే ఒక్క గురుభక్తి తీవ్రముగా వున్నవారి అంతఃకరణమే తమకు తగిన నివాసస్థానమని యీ అమానిత్వాది సద్గుణంబులెల్ల వచ్చి చేరగలవు. తీవ్రమగు గురుభక్తి చేతనే గురుకృపా సంసిద్ధికాగలదు. గురుకృపా విర్భావము కల్గినపిదపనే గురుపుత్రుడు తత్వాజ్ఞానార్థ దర్శనము చేయగలడు. గురూపదిష్ట జ్ఞానమనగా తత్వజ్ఞాన లక్ష్యస్వరూపమగు పరమాత్మ వస్తువును శిష్యునిచే దర్శింప చేయుటచే గలిగిన వస్తుసాక్షాత్కార జ్ఞానమే గాని కేవల పరమాత్మస్వరూపమును గూర్చిన చదువుట వలన, వినుట వలన గల్గిన జ్ఞానముగాదు. కేవలం బోధమాత్రం చేత వాచాజ్ఞానము మాత్రము గల్గి బుద్ధినిశ్చయం పొందగలడేగాని అపరోక్ష జ్ఞానముగలుగ జాలదు. "సర్వశరీరస్త చైతన్య ప్రాపకో గురురుపాస్యః'', గురుపరమాత్మను వుపాసించి గురుకృపకు పాత్రుడైనవాడే, తానే సర్వశరీరస్త చైతన్యము అనే జ్ఞానమారూఢ మగును. అతడేజ్ఞాని, అతడే తత్వజ్ఞానార్థదర్శనం చేసినవాడు. తత్వదర్శనం అనిపేర్కొనబడినవాడు అట్టివాడే మరి ఒకరికి గురువుగా నుండి జ్ఞానమును వుపదేశింప తగినవాడు. అతడొక్కడే శిష్యుల సర్వసంశయములను సందేహములను నివృత్తి చేయగలవాడు.'' భ్రాంతిరహిత మిదం మోక్షం'' అన్నసూక్తి ననుసరించి సకలభ్రాంతులను రహితముచేసి శాశ్వత జన్మరాహిత్యస్థితిని అట్టిగురుడే శిష్యులకనుగ్రహించగల్గును. ఏలననగా

అతడు పరమాత్మను సాక్షాత్కరించుకొన్నవాడు. సాక్షాత్తూ చూచినవాడు గనుక వున్నదున్నట్లుగా శిష్యుని శంకలకు సదుత్తరము లొసంగి ఆరూఢజ్ఞానము గల్గించగలడు. అట్లుగాక వస్తు సాక్షాత్కారము పొందనివాడు కేవలం గ్రంథపఠము వలన చేకూరిన జ్ఞానము గలవాడు (శాస్త్రపండితుడు) ఆ గ్రంథములో యిట్లున్నది. ఈ గ్రంథములో యిట్లున్నది. అని తన పాండిత్యము వెల్లడించగలడే గాని శాస్త్ర వైవిధ్యములకు సమన్వయము చేయజాలక, అది అప్రకరణార్థము, యిది యీ ప్రకరణార్థము అంటాడు లేక భాష్యములను ఏకరువుబెట్టి యిది ఈ మతభేదము, అదిఅద్వైతము యిది ద్వైతము యిది విశిష్టాద్వైతము అంటూ వ్యాఖ్యానించునే గాని శ్రుతి సమన్వయింపజాలక తానుతికమకపడినదేగాక జిజ్ఞాసి లోకమును మరింత గంధరగోళములో ముంచును, కనుక శాస్త్రజ్ఞానము వలన భ్రాంతి విస్తారమే గాని భ్రాంతి రహితమెంత మాత్రమూ కాదు. కనుకనే యీ శ్లోకంలో 'శాస్త్రజ్ఞానంబహు క్లేశం, బుద్ధేశ్చలన కారణం'' అని చెప్పబడినది.

ఉపదేశాద్ధరేర్బుద్ధ్యా :- అనగా వుపదేశమును ఏ మాత్రము మరువకుండా బుద్ధియందు ప్రతిష్ఠించుకొని యుండి అని అర్థము. అయితే వుపదేశమనగా మంత్రోపదేశ మాత్రం కాదని మంత్రలక్ష్యార్థమగు వస్తువనిన్ని తెలిసికొన్నాము. ఆవస్తువేది? యిష్టకామార్థ్యసిద్ధికి నానాదేవతల గురించి చెప్పబడు మంత్రములతోగాని, ఆయా మంత్రాధిష్ఠాన దేవతా నామరూపములతో గాని ప్రయోజనం లేదు. సృష్టికారణమగు బ్రహ్మవస్తువుతో తాదాత్మ్యస్థితి కొరకు చేయబడు మహావాక్యోపదేశముకూడా గాదు. కేవల జన్మరాహిత్యము కొరకు ఆత్మయొక్కయు, కేవలాత్మ యొక్కయు (అనగా యెరుక పరిపూర్ణముల యొక్క) ఆరూఢత కల్గించే నిమిత్తం చేయబడు మంత్రోపదేశమున్ను వస్తు సాక్షాత్కారము గావించుటయున్ను నిజమగు యుపదేశము అని తెలియవలెను. ఈ విధముగా గురూపదేశము పొందిన శిష్యుడు ఆపరిపూర్ణ యెరుకల వస్తు నిశ్చయజ్ఞానము. కల్గి క్షణమైన మరువక యుంటూ సకల కర్మలు నాచరించుచుండవలెను. అని యీ శ్లోకము యొక్క ద్వితీయపాదములో వివరింపబడినది.

పై విధంగా కర్మలాచరించు నాతడు. త్యాగియా? భోగియా? కర్మయోగియా? జ్ఞానయోగియా లేక భక్తుడా? అంటే అన్నియగును. కాని యందే యొక్కటి మాత్రమే అయి మిగతావి కాకుండా పోడు. పరిపూర్ణ మెరుకల నెరిగి యెరుక భ్రాంతి నుండి గురుమేల్కొ చెందియున్నవాడు గనుక విషయ బోగముల యందపేక్షకుడా వదలి యున్నవాడు గనుక అతడు త్యాగియే, యదృచ్ఛాలాభ సంతుష్టి గల్గి లభించిన వానిని ఆనందముతో తృప్తితో అనుభవించును గనుక అతడు భోగియు నగును. సంఘశ్రేయస్సుకు అనుకూలమగు సకల కర్మలు చేయును గనుక కర్మయోగి భుక్తి ముక్తి క్రియల యందు పూర్ణయోగమును పూనియున్నవాడు గనుక అతడు రాజయోగి అని కీర్తింపబడును. ఆత్మస్వరూప స్వభావములను వస్తు నిశ్చయమును తెలిసి "సర్వంయదయ మాత్మా" అను ఆత్మ నిశ్చయము

కలదు కనుక అతడఖండ జ్ఞానయోగి అనిన్ని చెప్పనగును, గురూపాసన అఖండంగా చేసి అనన్య ఏకాంత భక్తి సోపానముల చేరియుండును కనుక అతడుత్తమ భక్తుడు అయియున్నాడు. పరిపూర్ణ పరబ్రహ్మము నందు యెఱుకకు మూలంగాని, వుత్పత్తిగాని వుండుటకు స్థానముగాని లేదనే దృఢ నిశ్చయము కలిగి యున్నందున అతడశరీరి, స్థితప్రజ్ఞుడు, గుణాతీతుడు, కర్మయోగి, భక్తుడు, జ్ఞానిఅనువార్లయొక్క అన్ని లక్షణములు అతని యందు గాన నగును, అతనిని ఏమని కొని యాడుటకు సాధ్యము కాదు. కనుకనే "గురు గురుబోధలచేతను పరిపూర్ణము నెరిగి, యెరుక బాసిన యతనిన్ గురుతెరుగ నొరుల శక్యమె? యెరిగిన, నరులిట్టి బోధనెరిగేరోయన్నా, వారెరుగని మరుగుండదన్నా. "అంటూ కందార్థములో శ్రీకృష్ణదేశికులు సెలవిచ్చినారు.

ఇట్టి గురూపదిష్ఠ జ్ఞానముచే, భ్రాంతిరహితము సాధించి సకల కర్మలను కర్తృత్వరహిత బుద్ధితో ఆచరించుచూ, శేష జీవితము సాగించి శాశ్వత జనన మరణ రహితరూపమోక్షమును సాధించుటయే మానవుడై పుట్టినందులకు తరువాత గురుచరణములు పట్టినందులకు సార్థకము.

(12) 12. శ్లో॥ ఉల్కా హస్తోయధాకశ్చిత్ ద్రవ్యమాలోక్యతాం త్యజ్యేత్ ।
జ్ఞానేన జ్ఞేయ మాలోక్యపశ్చాత్ జ్ఞానం పరిత్యజ్యేత్ ॥

తాత్పర్యము :- మనుజుడు, దీపము చేబూని, చీకటిలో నున్న యేదేని వస్తువును. కనుగొన్న పిదప, ఆ దీపమును వదలివేయునో, అట్లే, జ్ఞానముచేత తెలయదగిన వస్తువును తెలుసుకొని జ్ఞానమును వదలి వేయవలెను.

"పరిత్యజేత్" అనుచోట, "వినశ్యతి" అని పాఠాంతరము. పరిపూర్ణమును లేని యెరుకను యెరిగి యెరుకను విడువవలెనని పూర్ణబోధ సిద్ధాంతము, జ్ఞానమనగా, యెరుక, యెరుక యనగా యెరిగేటిది. జ్ఞేయ మనగా యెరుగబడేది, "పరిపూర్ణమును లేని యెరుకను యెరిగి" అన్నప్పుడు, పరిపూర్ణము, యెరుక, రెండున్నూజ్ఞేయవస్తువులే అని అనవలసి వస్తూన్నది. కాని పరిపూర్ణమును జ్ఞేయవస్తువనదగునా? నిశితముగా విమర్శించి తెలిసికొనవలసి వున్నది.

జ్ఞానజ్ఞేయముల రెంటి యందు సమాన ధర్మములుంటేనే జ్ఞానము, జ్ఞేయవస్తువును తెలునుకొనగలదు. అనలు జ్ఞానము ఏవస్తువునైనను యెట్లు గుర్తెరుగుచున్నది? జ్ఞానేంద్రియముల ద్వారా విషయ పంచకమునూ, ఆ శబ్దాది విషయములుండిన వస్తువులను తెలుసుకొనుచున్నది. ఇట్లు యింద్రియములతో జతపడనపుడు తన్ను తానే అనగా తన ఆవరణమునే చూచుకొనుచున్నది. తనయందూ. తాన గుర్తించ గలిగిన వస్తువుల్ల యందూ సమాన ధర్మములున్న వన్నమాట. నిజానికి అన్ని తానేఅయినది. 'ఏకం అనేకం భవతి" అను శ్రుతియునూ "అన్నియూ తానై" అనే కందార్థమున్నూ యీ విషయము స్పష్టం

చేయుచున్నవి. తనయందు బీజరూపంగా (సూక్ష్మాతి సూక్ష్మంగా) పంచతన్మాత్రలు దాగియున్నపుడు ఆత్మ (బ్రహ్మ)యనీ, అవి, వికాసము చెంది విషయ స్వరూపములైనపుడు విశ్వమనీ, ఒక్క ఆత్మయే పిలువబడుచున్నది. కనుక తానే దృక్కు; తానే దృశ్యము తానే జ్ఞానం తానే జ్ఞేయం. అట్లే సర్వ ద్విపుటులు తానే, "ఆత్మ నోన్యంన కించన" అని శ్రుతి గనుక, తన్ను తనే చూచుకొనుచున్నది. తన్ను తనే తెలుసు కొనుచున్నది. నామరూపములు మాత్రం భేదించుచున్నవి. నిజ బింబములో లేని వికారములు ప్రతిబింబములో క్రొత్తగా మొలచిరావుగదా!

జ్ఞానజ్ఞేయములలో సమాన లక్షణములుంటేనే తప్ప వస్తువు గోచరించదన్నాము. ఉదాహరణకు రూపతన్మాత్ర నుండి కల్గిన చక్షురింద్రియమునకు రూపమున్న వస్తువులే గోచరించునుగాని, రూపము లేని వాయ్వాకాశములు గోచరించునా? అట్లే శ్రోత్రేంద్రియముచేత రూపమును గుర్తించ జాలముగదా! జ్ఞానమునందలి సత్వగుణాంశము, జ్ఞేయవస్తువు నందలి సత్వ గుణాంశముతో గూడినపుడే వస్తువు యొక్క జ్ఞానము కలుగుచున్నదని శాస్త్రజ్ఞులన్నారు. నిర్విషయమగు మనస్సు శుద్ధమగుటచే, అట్టి మనస్సు శుద్ధమగు ఆత్మను అపరోక్షము చేసుకొనగలదు. కనుకనే 'ఆత్మావారే ద్రష్టవ్యః XXX" అనిన్ని "మనసై వాను ధ్రష్టవ్యం" అనిన్నిశ్రుతులు పలుక్కుచున్నవి. కనుక జ్ఞానజ్ఞేయముల రెంటియందుసమాన ధర్మములుండక తప్పదు అని సిద్ధించుచున్నది. ఆత్మ చిద్ఘనమనీ, ప్రజ్ఞానఘనమని చెప్పబడుచున్నది. కనుక అదియే అఖండయెరుక, ఆయెరుకపరిపూర్ణ పరబ్రహ్మమునందు లేశమైన లేదు గనుక యెరుక చేత పరిపూర్ణ బ్రహ్మము గుర్తింపబడజాలదు. మరిన్ని జ్ఞానరూపమగు యెరుక సత్వగుణరూపము, పరిపూర్ణము గుణత్రయ రహితము (లేక శుద్ధ నిర్గుణము) అని కీర్తింపబడుచున్నది. పరిపూర్ణము, యెరుక, అను రెంటిలో సమానధర్మము లేమీ లేవు. కనుక జ్ఞానరూపమగు యెరుకకు పరిపూర్ణ పరబ్రహ్మముజ్ఞేయమని ఎంత మాత్రము చెప్పరాదు. పరిపూర్ణ బ్రహ్మ మెప్పటికీ అవిజ్ఞేయముగా నుండి పోవలసినదే. ఐతే, శ్రుతి, యుక్తి, తర్కములచేతను, గురువాక్యముల చేతనూ పరిపూర్ణపరబ్రహ్మము యొక్క అస్తిత్వము మాత్రము నిశ్చయము కాగలదు. ఇదియే వుండచూచుకొనుట అట్లని పరిపూర్ణ పరబ్రహ్మము అనుమాన ప్రమాణము చేతనే తెలియదగినది అని అనరాదు. పరిపూర్ణపరబ్రహ్మము ప్రత్యక్ష ప్రమాణగమ్యమూ గాదు అనుమాన ప్రమాణ గమ్యమూగాదు. షట్ప్రమాణములూ పనికిరావు. అది ప్రమాతృ ప్రమాణ ప్రమేయములను త్రిపుటికతీతము, కనుకనే అప్రమేయమన్నారు. మరిన్ని పరిపూర్ణమును జ్ఞేయమంటే అది దృశ్యకోటిలో చేరిపోవును. ఏలననగా "యద్యత్పశ్యతి చేక్షుభ్యాం తత్తదాత్మేతి నిశ్చయా; యద్యచ్ఛృణో తికర్ణాభ్యాం తత్తదాత్మేతి నిశ్చయా; " అనే శ్రుతినిర్ణయాను సారం జ్ఞానేంద్రియ పంచకముచే తెలియబడు సమస్తమూ ఆత్మే (యెరుకే) నన్నమాట. జ్ఞానేంద్రియములు ద్వారములు మాత్రమే. వానిద్వారా తెల్సుకొనేది మనస్సు లేక జ్ఞానము

కనుక జ్ఞానముచే తెలియబడే సమస్తమూ దృశ్యమే యనదగును కనుక జ్ఞేయ వస్తువులు అన్నీదృశ్యకోటిలోనేచేరి "యద్దృశ్యం తన్న శ్యం" అనే శ్రుత్యానుసారము, నశ్యాపత్తి కలవే అగుచున్నవి పరిపూర్ణ బ్రహ్మము దృశ్యమూకాదు. నశ్యమూకాదు జ్ఞేయమూకాదు: అవిజ్ఞేయమూగాదు సర్వద్విపుటులకు త్రిపుటులకు అతీతమైనది.

"ఉల్కాహస్తో యధాకశ్చిత్ ద్రవ్యమాలోక్య తాంత్యజేత్" అను దృష్టాంతము సరియగునా? దీపముచేత బట్టిన వాడు, దీపము, దీపకాంతిలో చూడదగు ద్రవ్యము, మూడు వున్నవి. అనగా ద్రష్టృ దృక్దృశ్యములగు త్రిపుటియున్నది. సృష్టికి పూర్వమున్న బ్రహ్మమే తెలియదగిన జ్ఞేయవస్తువై యున్నది. దానిని తెలుసుకొనుటకు అప్పుడెవరున్నారు? "ఏకమే అద్వితీయం బ్రహ్మ" అనీ, "నేహనానాస్తికించిన" అనీ, శ్రుతులు అప్పుడెవరున్నూ, ఆబ్రహ్మ వినాలేదని, వుండజాలదని, స్పష్టంచేయుచున్నవి. ఇక దానిని తెలుసుకొనువాడుగాని, వాని తెలివిగాని, తెలియబడునదిగాని ఆ బ్రహ్మము వినావుండుటకు వీలులేదు. కనుక జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయములు మూడున్ను ఆబ్రహ్మము నందే పర్యవసించుచున్నవి. అంటే ఆ ఒక్క బ్రహ్మమే జ్ఞాతయై, తనస్వరూపమైన జ్ఞానము చేతనే, తన్ను తానే తెలియ వలెనన్నమాట. కనుక జ్ఞాతృజ్ఞాన జ్ఞేయములు అవినాభావసంబంధముగలవై అందే యొకటి లేక పోయిన మిగతా రెండున్ను లేక పోవుచున్నవి.

"జ్ఞానేన జ్ఞేయమాలోక్య పశ్చాత్ జ్ఞానం పరిత్యజేత్" జ్ఞానజ్ఞేయములు వేరుగావు. "జ్ఞేయం సర్వమతీ తంచ జ్ఞానంచ మనవుచ్యతే జ్ఞానం జ్ఞేయం సమంకృత్వా యధానాన్య ద్వీతీయకం" అంటోంది గురుగీత. జ్ఞానజ్ఞేయములుఒకటిగాచేసిన అపైన రెండోదిలేదు. కనుక జ్ఞానమును పరిత్యజిస్తే జ్ఞేయం దానితోనేపోవును. దీపమును పారవేస్తె, లేక ఆర్పివేస్తే దీపప్రకాశము వానికి కనిపించునా? పరిపూర్ణ పరబ్రహ్మమునకు ఏలాటి సంబంధంలేదు. ఎప్పట్కీ వుండునది పరిపూర్ణ పరబ్రహ్మము లేకపోయే జ్ఞానజ్ఞేయములుకాదు. కనుక జ్ఞేయశబ్దము కారణ బ్రహ్మమునకే వర్తించును.

సర్వమునకు సత్తాయిచ్చునది. సర్వేంద్రియములను ప్రకాశింపచేయునది అజ్ఞానమే. దానిని ప్రకాశింప చేయునది మరివకటి లేదు. కనుకనే స్వయంప్రకాశమన్నారు తన్ను తాను ప్రకాశింపచేసుకొనుటయే గాక తన వలననైన, అనగాతానే అయిన, సమస్తమును ప్రకాశింపచేయును. ఇందుక్క దీపమే దృష్టాంతము. తన్ను తానుచూసు కొనుటయే గాక, తన ప్రకాశావరణ మందున్న సమస్తమును దీపమెట్లు చూపునో అట్లేనని తెలియవలెను. సర్వమును గుర్తెరిగేది యగుటచే దానిని జ్ఞానమనీ, తన జ్ఞానముచేత తన్ను తానే, (అనగాతన ఆవరణమునే) ప్రకాశింపచేసు కొన్నపుడు జ్ఞేయమని పిలువబడును, సర్వమును ప్రకాశింపచేయు కర్తయగుటచే, దానినే జ్ఞాతయనీ చెప్పనగును. సర్వమూ బ్రహ్మస్వరూపమే కనుక, సర్వత్రిపుటులూ బ్రహ్మమేగాని అన్యంగాదు. ముఖ్యముగా, సృష్టికి పూర్వమువున్నది ఆ బ్రహ్మమొక్కటియే గనుక, అకాలమునందు జ్ఞాతృ జ్ఞాన, జ్ఞేయములు అనే త్రిపుటి

ఆవశ్యము తానే అయివుండకతప్పదు. అపుడు తెల్సుకొనే జ్ఞాత, తెల్సుకోనే తెలివి (జ్ఞానము), తెలియబడే జ్ఞేయము, అనుమూడూ వేరువేరుగా మాత్రంగానరావు. కనుక సృష్టి కారణ బ్రహ్మమగు జ్ఞానజ్ఞేయ రూపములను వస్తు నిశ్చయ రూపంగా తెలుసుకొని, పరిపూర్ణ బ్రహ్మమందు ఆరెండూ లేవని గుర్తెరిగి రెంటినీ విడచినచో జ్ఞాన జ్ఞేయములు గానటు వంటి పరిపూర్ణ బ్రహ్మమొక్కటే శేషించును. గాని యది, మిగిలియుండునని చెప్పుటకెవరున్నూ లేరు.

ఈ శ్లోకమును వుత్తరగీతలోనున్న పాఠముననుసరించి యింతవరకు విమర్శించుట జరిగినది. "పశ్చాత్ జ్ఞానం వినశ్యతీ" అని పాఠాంతరంకలదు. ఈ పాఠమును స్వీకరించినచో జ్ఞేయ శబ్దమునకు పరిపూర్ణ బ్రహ్మమనియే అర్థము చెప్పవలసి వుండును. అపుడు పరిపూర్ణమును "అలోకించిన" జ్ఞానము తనంత తానే లేకుండాపోయి "వినశ్యతి" అనగా నశించును అని అర్థమును చెప్పవలసివుండును. సూర్యుని చూడబోయిన చీకటి నిలువలేక తనకు తానే నశించునట్లు అను దృష్టాంతమున్ను చెప్పవచ్చును. ఐతే, చీకటి సూర్యుని ఎపుడైన యెదుట నిల్చి కనుగొనగలదా? అట్లే జ్ఞానం పరిపూర్ణమును ఆ లోకించగలదా? కాని, తాను గానటువంటి వస్తువులు తనకు బహిప్రదేశమునందే యుండును కనుక తన్నువిడచి చూడవలసి వుంటుంది. తానుండి చూడలేదు. కనుక తన్ను విడచుట, దానిని చూచుట ఏక కాలమునందే జరుగును. కనుక యీ పాఠము నంగీకరించుటకు, "ఆలోక్య' ' "పశ్చాత్" (అనగా తరువాత) అను శబ్దములు, అవరోధములుగానున్నవి. యీ పాఠంలో దృష్ట ద్రాష్టాంతికములకు పొంతనకుదరదు.

పరిపూర్ణ బ్రహ్మమును, జ్ఞేయమని చెప్పరాదునుటకు కారణములు యీ దిగువను క్రోడీకరించబడినవి.

1. పంచతన్మాత్ర విషయములను మాత్రమే తెలుసుకొను జ్ఞానము. పంచతన్మాత్ర రహితమున్నూ జ్ఞానా జ్ఞాన రహితమున్నూ అగు పరిపూర్ణమును తెలియజాలదు. "నచక్షుర్గచ్ఛతి, నావాగ్గచ్ఛతి, నోమనః" అను శ్రుతియున్నూ, "కాదది నీచే తెలియన, ఏదిర తన్మాత్ర సమితి యీ బట్టబయటా" అని కందార్థములోను చెప్పబడినది.

2. అవలోకనం, అనగా చూచుట, అని సామాన్యార్థం యీ అర్థం, పరిపూర్ణమను కంటితోగాని మనస్సుచేగాని చూచుట బొత్తిగా పొసగదు కనుకపనికిరాదు. విశేషార్థంలో ఆలోకనమనగా వివేచించుట, లేక విచారించుట, అట్టి విచారణవలన, పరోక్షజ్ఞానము అనగా వుండజూచుకొనుట (Indirect Knowledge) మాత్రమే గలుగును. అనగా పరిపూర్ణ పరబ్రహ్మ యొకటి గలదనే ఆస్తిక్యత మాత్ర మారూఢమగును. వివేచన అనగా, యెరుకచేత భావించుట మాత్రమే జరుగును. కనుకనే "యెరుక లేక సేవించదగును" అని శ్రీ కృష్ణ దేశికేంద్రులన్నారు. మరిన్ని, "లేనెరుకతో దీన్ని గనిపెట్టి పాదొట్టుమెరుక" ననిస్థలాంతరమున చెప్పినారు, దీపము

వస్తువును ప్రకాశింపజేయునుగాని, జ్ఞానము పరిపూర్ణ పరబ్రహ్మమును ఎంత మాత్రము ప్రకాశింప జేయలేదు. "పరిపూర్ణ మనగ నెట్టిదా, యెరిగెదననియెరుక బయటకేగిన, యెరుకే యెరుకకకు శూన్యంబయ్యేను; యెరుకను జన్మించినట్టి యీ విశ్వమంతా, యెరుకవలెనె ఏమీ లేదంతా XXX" శ్రీకృష్ణదేశికులు సెలవిస్తున్నారు. "ఎరుకను జన్మించినట్టి యీ విశ్వమున్ను, ఎరుక యావరణమున్ను విశ్వమునందలి సర్వమున్ను జ్ఞేయమనదగును. కనుక జ్ఞానజ్ఞేయము లనగా యెరుక విశ్వములే. పరిపూర్ణమును యెరుగ ప్రయత్నిస్తే యెరుక విశ్వములు రెండూ నశించుననియే శ్రీ కృష్ణదేశికేంద్రులు కూడా పై కందార్థములో వుటంకించినారు.

3. శ్లో॥ జ్ఞానం జ్ఞేయం, పరిజ్ఞాతాత్రివిధం కర్మచోదనా కరణం, కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః॥ భ. గీ॥ 18-13 జ్ఞాతృజ్ఞాన జ్ఞేయములు కర్మప్రవృత్తికి హేతువులై, జ్ఞేయవస్తు ప్రాప్తికి అనుగుణమగు సాధనారూపకర్మను చేయుటకు ప్రేరేపించి, కర్త కర్మక్రియలనే మరొక త్రిపుటికి కారణమగుచున్నవి. అని భావము. జ్ఞానకర్మలు లేనిది, సాధనాంతర నిరపేక్షకమూ, అయిన పరిపూర్ణ పరబ్రహ్మమును, కర్మప్రవృత్తి జనకమగు జ్ఞేయరూపంగా భావించి పేర్కొనుట అనుచితము. ఈ శ్లోకము వ్యష్టిరూపమగు పిండాండము విషయంలో మాత్రమే వర్తించునేమోయన శంకింపరాదు. పరమాత్మ (అఖండయెరుక) జ్ఞానఘనముగదా! జ్ఞాతృజ్ఞేయ జ్ఞానములు, కర్తకర్మక్రియలనే సర్వత్రిపుటులకు అదే అత్యంత మూలకారణము. "సోఽకామయత బహుస్యాం" అది అనేకం కావలెనని సంకల్పించు కర్తయు, "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" సృష్టించుట, సృష్టించిన వానిలో ప్రవేశించుట, అను కర్మక్రియలున్ను దానికున్నవిగదా! మరిన్ని, 'ఆటాడి, యాడకుండును, XXXఅనుకందార్థములో', ఎరుకయే సర్వకర్తయనిన్ని, అచలపరిపూర్ణము సర్వథా అకర్తయనిన్ని యుద్ఘాటించారు. కనుక జ్ఞేయశబ్దము పరిపూర్ణ పరబ్రహ్మమున కెంత మాత్రము వర్తింపనేరదు.

4. జ్ఞానము కొద్దిగొప్పలైన ఆవరణములు గలది దాని ఆవరణ పరిధిలోనికి వచ్చినవస్తువు మాత్రమే జ్ఞానమునకు జ్ఞేయము కాగలదు. జ్ఞానముతోపాటు (వస్తుజ్ఞానమే జ్ఞేయ మనదగును గనుక) జ్ఞేయమున్ను పోవును. అచలపరిపూర్ణము నిరావరణము, అపరిమితము కనుక జ్ఞానావరణము లోనికి రానేరదు. పోనూపోదు. పరిపూర్ణము జ్ఞేయమని అంటే దానికి రాకపోకలు చెప్పవలసి వుండను.

5. మనోవాక్కుల కందని పరిపూర్ణ బ్రహ్మమును ఏ శబ్దముచేతను పేర్కొనజాలము, జ్ఞానముచే తెలియబడే జ్ఞేయశబ్దముచే అసలే పిలువరాదు. మరి మాయవంటి అనిర్వచనీయ వస్తువే యీ పరిపూర్ణ బ్రహ్మమని కొందరపోహ పొందవచ్చును అనిర్వచనీయ మంటే - యిదమిద్ధమని ఏనిర్వచనము చెప్పరానిది అని మాత్రమే అర్థము. ఆదిశంకరులు వివేక చూడామణిలో "సన్నాప్యసన్నాప్యుభయాత్మికానో, భిన్నాప్యభిన్నాప్యు భయాత్మికానో, సాంగాన్య సంగాన్యుభయాత్మికానో; మహాద్భుతానిర్వచనీయ రూపా" అని మాయను వర్ణించారు.

అంటే - సత్తు, అసత్తు, సద సత్తు కూడా అయివుంది. అన్నీ అదేగాని ఏ వొక్కటీ అయివున్నదని నిర్దేశించి చెప్పరాదు. అట్లే, అది భిన్నమా, అభిన్నమా, వుభయాత్మకమా అంటే ఎట్లు చెప్పినా చెప్పవచ్చును. అన్నీ అయి ఏ ఒక్కటీ కాకుండా వుంది. అట్లే సాంగము, అసంగము, వుభయాత్మికము కూడా అయి నిర్వచనకసాధ్యమైయున్నది. కాని పరిపూర్ణము శబ్ద నిశ్శబ్దములు మీరి వాక్కుకు కేవలం అగోచరమై యున్నది. అది సర్వలక్షణ విలక్షణము, సర్వాతీతము అగుటచే జ్ఞేయమని ఎంతమాత్రం చెప్పరాదు.

ఈ శ్లోకము భ్రాంతిరహితశ్లోకములలో చేర్చినారు ఇది భ్రాంతిరహితమెట్లు గావించుచున్నది? అంటే, జ్ఞానమే బ్రహ్మమని కొందరు జ్ఞేయము బ్రహ్మమని మరికొందరు భిన్నాభిప్రాయములు చెప్పినారు. జ్ఞాన జ్ఞేయములు రెండున్నూ పోవునవే, వీని రహితమునందు జన్మరాహిత్యస్తితి అని చెప్పేదము. గుర్తెరిగిగాని ఎవరున్నూ ఏ కర్మయున్నూ చేయరు. కర్మ వున్నంతవరకు జన్మ తప్పదు. జన్మవచ్చి కర్మ చేయును ఆ కర్మానుభవమునకు జన్మలెత్తును. యిట్లు జన్మవలన కర్మకర్మవలన జన్మ యిట్లనంతముగా సంసారచక్రములో జీవుడు పరిభ్రమించును జాత్యజ్ఞాన జ్ఞేయముల రహిత స్థితిని యీ శ్లోకముటంకించుచున్నది. కనుకనే భ్రాంతి రహిత శ్లోకములలో చేర్చబడినది. యదార్థముగాని వూహ (లేక) భావమే భ్రాంతి గదా! యదార్థ అయదార్థ జ్ఞానములు గల్గించు సంవిద్రూపమగు యెరుకయే అని పరిపూర్ణ పరబ్రహ్మమునందు భ్రాంతి కారణములూ లేనేలేవు - జ్ఞాన, జ్ఞేయములు రెండూ లేని, రెండూకాని పరిపూర్ణ పరబ్రహ్మమే వున్నది. అని అచల ఋషుల సిద్ధాంతము.

(13) 13. శ్లో॥ జ్ఞాన మజ్ఞానినంద్యష్ట్యా౹ ద్వయోస్త జిత నిశ్చయం
ద్వయోస్త జతియత్ జ్ఞానం తత్ జ్ఞానంచ పరిత్యజేత్ ॥

తాత్పర్యము :- మానవుడు తనవివేక జ్ఞానముచే, జ్ఞానాజ్ఞానములను విమర్శించి చూచినపుడు, జ్ఞానాజ్ఞానములు రెండును, ఒకే జ్ఞానము యొక్క రెండు లక్షణములుగా గుర్తించి, ఒక స్థితి నుండి వేరొకస్థితికి అవి మార్పు చెందుచున్నందున అవి రెండునూ కూడా అశాశ్వతములు, అనిగ్రహించి, రెండునీ కూడా పరిత్యజించుచున్నాడు. రెండుని పరిత్యజించిన ఈవిచక్షణ జ్ఞానముకూడా అశాశ్వతమేనని గ్రహించి, అజ్ఞానమును కూడా విడిచి సత్యమునుచేరుటకు పయనించుచున్నాడు.

విశేష వివరణములు : 1. జ్ఞానము: 2. అజ్ఞానము; 3. త్యజతి; 4. పరిత్యజేత్ జ్ఞానజ్ఞానములు: జ్ఞానమనగా సామాన్యార్థములో, తెలివి అని అర్థము. తెలివి అనగా తెలుసుకును శక్తిగల ఒక పనిముట్టు; జ్ఞానమునకు ఎరుగుట అది భౌతికమైయున్నది. ఈ జ్ఞానము అంతరేంద్రియపంచకములో మొదటిది. దీనినే అంతఃకరణము అనగా, లోపలిపనిముట్టుగా కూడా చెప్పబడుచున్నది వృత్తిబేధముచే ఈ అంతఃకరణయే మనస్సు;

బుద్ధి, చిత్తము, అహంకారము అను పేర్లతో, ఆయాపనులు చేయుచు **అంతఃకరణ** చతుష్టయంగా నున్నది. జాగ్రదవస్థలో ఈ 5 విధములుగాను పనిచేయుచు, స్వప్నావస్థయందు ఈ పంచ విధ వ్యవహారములను చేయక, మనోబుద్ధుల యొక్క వ్యాపారములను మాత్రము సాగించుచు, సుషుప్తియందు ఈ ఐదు వ్యవహారములు పూర్తిగా విరమించి **విశ్రాంతిచెందు** చున్నది. అనగా సర్వమును గుర్తెరిగే జ్ఞానము, దేనిని గుర్తించక, **అంతఃకరణము** జడ రూపము వహించుచున్నది. ఆ జడస్థితినే ''మరుపు'' లేక ''**అజ్ఞానము**'' **అని** వ్యవహరింపబడుచున్నది. ఈ జడ లక్షణములే ఎరుక మరుపులు; జ్ఞానాజ్ఞానములు; అని పిలవబడుచున్నది.

జ్ఞానజ్ఞానములు, రెండును ఒక నాణెము యొక్క రెండు ప్రక్కలనుండు, బొమ్మ బొరుసులవంటువేగాని, విభిన్నవస్తువులు కావు. విభిన్న స్థితులు మాత్రమే: ఒకే అంతఃకరణము జ్ఞానరూపంగాను, మరోకప్పుడు అజ్ఞానరూపంగాను వుండుట మాత్రమే: ఎరుగుచుండుట, ఎరుగకుండుట: ఎరిగినపుడు జ్ఞానము ఎరగనపుడు అజ్ఞానము: ఈ జ్ఞానాజ్ఞానముల రెండును లేక, వుండు వస్తువులకు జడములనియు, జ్ఞానాజ్ఞానములుగా వర్తించు ప్రాణులను చేతనములనియు పిలువబడుచున్నది. కాని ఈ చిజ్జడములన్నియు ఒకే ఆత్మ యొక్క (అఖండ ఎరుక) పరిణామములే. నిమిత్త ఉపాదానము కారణములుగా నుండి, నామ రూప భేదము మాత్రమే కలిగి యున్నందునను, నామరూపములు మార్పు చెంది మిథ్యా భూతములనియు, ఉపాదానకారణము అగు బ్రహ్మ వస్తువు (ఆత్మ) మాత్రమే సత్యమనియు, ''బ్రహ్మసత్యం జగన్మిధ్యా'', అని అద్వైత సిద్ధాంతమందు ప్రతిపాదింపబడినది. ఆ విధముగా అద్వైత సిద్ధాంతప్రకారము కూడా, చిజ్జడములు, జ్ఞానజ్ఞానములు లేక ఎరుక మరుపులు, తేజోంధకారములు, మొ॥ సర్వద్వంద్వములు ఒకే ప్రతిపత్తి కలిగినవై యున్నవి. కనుక సర్వ ద్వంద్వములు రెండు సత్యములు, లేక రెండు అసత్యములు కావలసి యుండునుగాని ఒకటి సత్యము, మరొకటి అసత్యము, ఒకటి శాశ్వతము, మరొకటి అశాశ్వతము: ఒకటి బ్రహ్మము మరొకటి మాయ కాజాలవు. అద్వైత సిద్ధాంత ప్రతిష్టాపనా చార్యులుగు ఆదిశంకరులుకూడా, ఆదిలో 'దేహినిత్యము, దేహమనిత్యము' అని ప్రతిపాదించిననూ, చివరకు 'సర్వవేదాంతసార సంగ్రహము అను పేరవారు రచించిన గ్రంథములో'' యధామృణయో కుంభం, తద్వతే దేహపి చిన్మయః' అనగా మట్టితో తయారు చేయబడిన కుండ అంతయూ, మృణ్మయమె అయినట్లుగా, దేహమంతయూ కూడా చిన్మయమైయున్నది అని, చెప్పి యున్నారు. స్థూలరూపమగు దేహమును మాత్రము విడదీసి చూచినచో, దేహము జడము, అజ్ఞానరూపము: అయివున్నదే గాని, ''సర్వమదయ ఆత్మ'' అని చెప్పబడినరీతిగా, సర్వమూ ఆత్మమయమే అయివున్నపుడే, దేనిని అచేతనమని (జడము) చెప్పవలెను, చిజ్జడములు రెండూ ఓత ప్రోతమై, విడదీయరానివైయున్నది. అందు ఒకటి లేనిచో రెండునూ వుండజాలవన్నమాట, దీపములేని ప్రకాశముగాని, ప్రకాశములేని దీపము వుండజాలవుకదా!

వస్తువుయొక్క సూక్ష్మము, వస్తువును విడిచి వేరే మరొకచోటవుండునా! కనుక దీపమువున్నచోటనే, కీనీడయు, వుండునట్లు, జ్ఞానమును ఆశ్రయించి అజ్ఞానము, అజ్ఞానాశ్రయించి జ్ఞానము వుండక తప్పదు. కనుకనే గీతాచార్యుడు," "అజ్ఞానే నావృతంజ్ఞానం, తేనముహ్యంతి జంతవః" అనిశలవిచ్చినారు. జ్ఞానాజ్ఞానములు రెండును, విడదీయరానివై యున్నందున ఈ ప్రశ్ననే అచలఋషులు సంపూర్ణముగా విమర్శించి, జ్ఞానాజ్ఞానములు రెండునూ, బంధకారణములే అని గుర్తించినారు. అజ్ఞానమే లేకమాయమే జన్మకు అత్యంత మూలకారణము, అని అద్వైత సిద్ధాంతములో, మాయ, మాయనుండి అజ్ఞానము. అజ్ఞానమునుండి అవివేకయు, అవివేకమునుండి అహంకారము, అహంకారమునుండి అభిమానము, అభిమానమునుండి రాగద్వేషములు, రాగద్వేషములనుండికర్మ! కర్మనుండి జన్మ అని అవిద్యా సప్తావరణములు నిర్దేశించినారే కాని జడమగు మాయ బ్రహ్మము యొక్కచేతన సత్తాలేనిచో, స్వయముగా ప్రవర్తింపజాలదుకదా! కనుక బ్రహ్మమే జన్మ పరంపరలకు అత్యంతమూలకారణమని చెప్పవలసియున్నది. బ్రహ్మము చిద్ఘనములేక జ్ఞానమున్ను, మాయలేక అజ్ఞానము, అజ్ఞానఘనమున్ను అయివున్నవికదా! కనుక జ్ఞానా జ్ఞానములు రెండునూ, జన్మకర్మలకు మూలకారణములై వున్నవి. ఇందొకటి వుపాదేయమును, వేరొకటి హేయమున్ను, కాజాలవు. కనుక విమర్శించినపుడు జ్ఞానాజ్ఞానములు రెండును పరిత్యాజ్యములే అయివున్నవి. జ్ఞానములేనిచో ఈ విమర్శచేయుటకే సాధ్యము కాదుకదా! కనుక జ్ఞానము చేతనే జ్ఞానాజ్ఞానములు రెంటిని విమర్శించి రెండునూత్యజింపదగినవే అని మానవుడు నిశ్చయింపవలెను. కనుకనే పై శ్లోకమునందలి ప్రథమపాదము 'జ్ఞానమజ్ఞానినందృష్ట్వా! ద్వయోస్త్యజతి నిశ్చయం" అని పేర్కొన్నది.

విశేషార్థములో, జ్ఞానమనగా బ్రహ్మపదార్థమే, "జ్ఞానాదేవతు "కైవల్యం" అనగా సృష్టికి పూర్వము తాను తానై, ఏకమాత్రముగా నుండు బ్రహ్మమే, కేవలము జ్ఞాన స్వరూపమై, ఏకమాత్రముగా నుండు బ్రహ్మమే, కేవలము జ్ఞానస్వరూపమై, ఏకమాత్రముగానున్నది. దానినే జ్ఞానఘనము, చిద్ఘనము, ప్రజ్ఞానఘనము, అనుసమానములచే, వేదాంత శాస్త్రము అభివర్ణించుచున్నది. ఈ దృక్పథముతో, జ్ఞానశబ్దమునకు ఒక చక్కని నిర్వచనము ఈయబడినది. "సర్వము నందు తాను, తనయందు సర్వము, తానేసర్వము" అని నిర్వచింపబడినది. మరిన్ని, "ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానంభవతి" అనగా ఏ వస్తువు యొక్క పరిజ్ఞానముచేత సర్వవస్తు పరిజ్ఞానము కలుగునో, అదే జ్ఞానము, ఆత్మ బ్రహ్మము, మరిన్ని భగవద్గీతలో "ఏవం జ్ఞాత్వా, నేహభూయోన్యత్ జ్ఞాతవ్యమవశిష్యతే" అనగా ఏది తెలుసుకున్న పిదప, ఇక తెలియ తగినది లేదో అదియే జ్ఞానము, (బ్రహ్మము) అని చెప్పబడినది. మరిన్ని 'అధ్యాత్మజ్ఞాననిత్యం, తత్వజ్ఞానార్థ దర్శనం, ఏతత్ జ్ఞానమిద ప్రోక్తం, అజ్ఞానంయతథోన్యథా' ' అనగా బ్రహ్మజ్ఞానమే శాశ్వతమైన జ్ఞానమనియు, ఆ తత్వ జ్ఞానముచే తెలియబడు బ్రహ్మవస్తువుయొక్క (జ్ఞేయబ్రహ్మము) సాక్షాత్కారమే జ్ఞానమనియు, ఇతరమంతయు

అజ్ఞానముగానే చెప్పవలయుననియు దీనిభావము. ఏలననగా, బ్రహ్మేతరమగు సమస్తము నామరూపకమగు మిథ్యాభూతము అనియు, అట్టి మిథ్యాభూత నామరూపక జ్ఞానము, అజ్ఞానమే అనియు యిందు నిశ్చయింపబడినది. కనుక బ్రహ్మజ్ఞానమే జ్ఞానమనియు, అనాత్మరూపమగు మిగతా సమస్తముయొక్క పరిజ్ఞానము అజ్ఞానమనియు సిద్ధించుచున్నది. కనుక జ్ఞానాజ్ఞానముయొక్క ఒకే అర్థములో కూడా ఆత్మ అనాత్మ అను ద్వంద్వములు సాపేక్షికములే. కాని నిరపేక్షికబ్రహ్మస్వరూపము (అనగా పరిపూర్ణ పరబ్రహ్మము) కాజాలదు. కనుక ఈ జ్ఞానాజ్ఞానములు రెండును చివరకు విడువ తగినవే అయివున్నవి.

త్యజతి : త్యజ అనగా విడుచుట. భౌతిక వస్తువులను చేతులతో పట్టి విడువవచ్చును. జ్ఞానాజ్ఞానములు, భౌతికవస్తువులు కాదుగదా! ఎట్లు పరిత్యజించవలెను? కట్టుకున్న మంచి బట్ట విడువవచ్చు. కట్టుకున్న ఆలిని విడువవచ్చు కాని చేతితో పట్టరాని, సూక్ష్మములగు, కంటికికానరాని భాతిసిద్ధ పదార్థములను, విడుచుట ఎట్లు? సూక్ష్మమును సూక్ష్మము చేతనే పరిహరించవలెను. ఆ భావమునే ఈ శ్లోకమున "ద్యయస్తయజ్ఞానం". అనగా ఏ జ్ఞానమే విడుచుచున్నదో అజ్ఞానముకూడా విడవవలెనని చెప్పబడినది. అనగా జ్ఞానాజ్ఞానములను ఏ జ్ఞానము విడుచుచున్నదో, ఆ జ్ఞానముకూడ విడువవలయును అనికదా భావము. అందే జ్ఞానాజ్ఞానములను విడిచే వస్తువుకూడా, జ్ఞానమే అయివున్నది. అని స్పష్టము, అనగా, జ్ఞానమును, లేక అజ్ఞానమును, సూక్ష్మరూపమగు జ్ఞానముచేతనే విడువవలయును.

"ఇది అపశబ్దము, యిది శబ్దంబని ఎరిగిన ఎరుకలో ఎరుకనీవు" అని చెప్పబడినరీతిగా. ఇది మంచి, ఇది చెడు అని వివేకదృష్టితో ఏ జ్ఞానము నిర్ణయించుచున్నదో ఆ జ్ఞానము చేతనే ఈ భేదజ్ఞానమును పరిహరించవలయును. ఏలననగా! జ్ఞానాజ్ఞానము ద్వంద్వ రూపముగా కానవచ్చిననూ, "జ్ఞానాజ్ఞానంబులు ఈ జ్ఞానానివేకాని, వేరుకావెన్నడు" అని శ్రీకృష్ణదేశి కేంద్రులు సెలవిచ్చినరీతిగా, విభిన్న కోణములలో రెండుగా తోచబడుచున్నవే కాని! రెండునూ, ఒకేవస్తువునకు సంబంధించినవై యున్నవి. అనగా ఒకే జ్ఞానము. జ్ఞానాజ్ఞానములుగా తోచబడుచున్నవన్నమాట! అట్టి బేధము నామమాత్రమే: కనుక ముందుగా నామమాత్ర భేదము తొలగించి ఏకమాత్రమగు జ్ఞానమును మార్పుచెందు స్వభావము గలదగుటచే, "యామాసామాయ" అనగా ఏది మార్పుచెందుచున్నదో అది మాయ అనగా లేనిది అని నిశ్చయించి, దాని విడువవలయును సత్యా సత్యములు, రెండును గుర్తెరిగి, పారమార్థిక సత్యమగు పరిపూర్ణ పరబ్రహ్మముయొక్క నిశ్చయమైన, ప్రాతిభాసిక సత్యమగు (కలవంటిదగు) ఈ అఖండ జ్ఞానమును, లేనేలేదని నిశ్చయించి, దానిని విడువలయును.

పరిత్యజేత్ : "త్యజా అనగా విడువుము అని అర్థము, పరిత్యజ అనుటలో విశేషమేమి? పరిత్యజ అనగా సంపూర్ణముగా విడువుమని అర్థము. అంటే ఏ లేశమాత్రమునూ, మిగుల్చుకొనకుండా విడువుము అని అర్థము. తల్లి వేరు ఛేదించ కుండా వృక్షముయొక్క

మొదలు నరికినను, చెట్టు నశించదు. చిదిమినకొద్ది చిగుర్చుచునేయుండును. ముళ్ళ చెట్టు కాలికి గుచ్చుకొని బాధపడినపుడు, ఆర్యచాణక్యుడు, ఆ చెట్టునుసమూలంగా దెగనరికించుటయేగాక, దానిని తగులబెట్టి ఆబూడిదను నీటిలో కరిగించి వేసెనట. అంటే సమూలముగా పీకిపారవేసిననూ ఆతల్లివేరు, మరల పృథివి సంయోగముతో, మరల నాటుకొని తిరిగి బ్రతుకుటకు కూడా ఏమీ సావకాశములేకుండా, చేసెను" అట్లే ఈ మూలజ్ఞానము ఏ మాత్రములేకుండా చేసినగాని, అది తిరిగి విజృంభించి బంధకారముకాగలదుకనుక, జ్ఞాన స్వరూపమునేగాక, జ్ఞేయస్వరూపమును కూడా, లేశమాత్రము లేకుండా, పరిత్యజించవలెను. అని చెప్పుటకే "పరిత్యజేత్" అను శబ్దప్రయోగము చేయబడినది.

పరిపూర్ణ భావమందు పంచతన్మాత్రులుకాని, పంచతన్మాత్రవిషయముకాని, లేశమైనను లేవు. లేశముగా కలిగియున్నది. సృష్టికారణ బ్రహ్మయైన ఆత్మకనుక 'పరిత్యజేత్' అనుటలో బంధమునకు అత్యంతమూలకారణమగు, అఖండ జ్ఞానస్వరూపమైన, సృష్టికారణ బ్రహ్మమునే సంపూర్ణముగా, విడువవలయును. ఏలననగా! ఆ సృష్టికారణ బ్రహ్మయే, సర్వ నత్తాంశము, స్వయంప్రకాశము. దానికి జ్ఞానమే స్వరూపలక్షణము, అయిననూ, పరిణామములో, అజ్ఞానస్వరూపమగు, ఆవరణరూపము చెంది, అనంతముగా జనన మరణములను పొందుచున్నది. కనుక జ్ఞానమే స్వరూపలక్షణముగా గల ఈ ఆత్మయొక్క సత్యత్వ దృష్టి, నిశ్శేషముగా నశించినగాని, భ్రాంతిరహితముకాదు. జ్ఞానాజ్ఞానములను విడుచుటకు, సత్తానిచ్చునది. ఈ అఖండజ్ఞానమేకనుక, ఆ అఖండజ్ఞానమును కూడా విడిచినగాని, సర్వభ్రాంతిరహితము కాదు. "భ్రాంతిరహితమిదం మోక్షం" అట్టి "భ్రాంతిరహితమునందేశాశ్వతమగు జన్మరాహిత్యమూ, జ్ఞానజ్ఞానములు, కేవలము బాతిసిద్ధ పదార్థములేనా! లేక ఆస్తిసిద్ధ పదార్థములా! ఆత్మ కూడా వైశేషిక దర్శనములో చేర్చినారు దానికి ద్రవ్య గుణ కర్మసామాన్య విశేష సమవాయ; అభావ లక్షణములను నిర్ణయించినారు. కనుక అది అస్థిసిద్ధ పదార్థమే అనవచ్చును. కనుక దానికి ఆవరణ యొకటి యుండుట తప్పదు. ఆ ఆవరణయే ఆకాశము, ఆకాశము కేవలము అజ్ఞానస్వరూపము, దీపము, దీపప్రకాశము, ఎట్లో, అట్లే ఆత్మ ఆకాశములు, ఏక వస్తురూపముగా నున్నప్పటికి జ్ఞానాజ్ఞానములను రెండు లక్షణములు కలవిగానున్నవి. కాని వస్తువు ఏకమాత్రమే ముందుగా ఈ జ్ఞానాజ్ఞానములు రెండునూ ఒకే వస్తువుయొక్క రెండు రూపములే, అని వానిభేదమును త్యజించి, ఆత్యజించిన, సర్వసత్తాంశ రూపమగు అఖండ జ్ఞానమునే, పరిపూర్ణబోధచే, పరిత్యజించవలసియున్నది. లేనిచో జన్మపరంపరలకు, అత్యంతమూల కారణమగు బీజనాశము కాదు. భ్రాంతిరహితముకాని, జన్మరహితముకాని, కానేరదు.

14 

14. శ్లో॥ విద్యాంతం బ్రహ్మవిద్యాంతం । వార్తికాంత మగోచరం
పూర్ణబోధ ప్రవక్ష్యామి । శృణుశిష్య మహోత్తమః ॥

తాత్పర్యము :- లౌకికవిద్యలకు, బ్రహ్మవిద్యకు, వార్తిక సిద్ధాంతమునకు, పిదప నేర్చుకొనతగినదై, సమస్తేంద్రియములకు అఖండరూపమైన జ్ఞానమునకు కూడా అగోచరమై అనగా తెలియరానిదై వున్న పరిపూర్ణ బోధను మీకుబోధించ సమకట్టి యున్నాను. ఆ బోధకుమించిన బోధ మరియొకటిలేదు. ఏకాగ్రతతో శ్రవణముచేయుము. శిష్యా! అని సద్గురువు పూర్ణాదికారియగు సత్శిష్యునితో చెప్పుచున్నాడు.

విశేష వివరణములు : 1) విద్యలు, 2) బ్రహ్మవిద్యలు 3) వార్తిక సిద్ధాంతము 4) అగోచరము 5) మహోత్తమం.

1) విద్యలు :- విద్య అనగా! "విద్" అను సంస్కృత ధాతువునుండి ఉత్పత్తి అయిన శబ్దము. "విద్" అనగా తెలియుట, కనుక విద్య అనగా తెలియవలసినది. లేక తెలియచేయునది అని అర్థము. పశుపక్షి, క్రిమికీటకాదులకు, ఆహార నిద్ర, భయ, మైదునములను, జీవితములో నడుపుటకు వలయు సామాన్య జ్ఞానమే వున్నదికాని మానవులకువలె విచక్షణాజ్ఞానము లేక విమర్శనా జ్ఞానము. లేక వివేకజ్ఞానము అనునది లేదు. మానవునికే ఈలోకమేమి? ఈ లోకమును చూచునే నెవరు? నేను ఎక్కడనుండి వచ్చితిని? ఎక్కడకు పోదును? నాజీవితలక్ష్యమేది? పూర్వాపరజన్మలున్నవా? ఇత్యాది బహు విదములైన ప్రశ్నలకు సరసమైన సమాధానముల గూర్చి జిజ్ఞాసచేయు విశేషజ్ఞానమున్నది. అయితే ప్రాణధర్మములైన ఆకలిదప్పుల నివారణకు బ్రతికియున్నంతకాలము సాధ్యమైనంత సుఖమును పొందుటకును, ధనార్జనచేయుట, మానవునకు అవసరమైయున్నది. ధనార్జనకు, విద్యార్జన అవసరమైయున్నది. అంతేగాక అధికాఅధిక సుఖములనాశించి, మానవునికి అనేక కోరికలుదయించుచున్నవి. ఆయా కోరికలను, తీర్చుకొనుటకు వలయు శక్తి సామర్థ్యములను సంపాదించుటకే కామ్య విద్యలు నిర్ణయింపబడినవి. అవి ఏవనగా 1) తైత్తరీయపురుష విద్య, 2) ఉద్గీతో విజ్నప ప్రణవవిద్య 3) ప్రతిణవేపతోచరీయస్త్యాది వృత్తవిద్య 4) ప్రణతే హిరణ్మయవిశిష్ట భగవద్దృష్టి విద్య, మొదలగునవి నిర్ణయింపబడినవి. ఇదిగాక ఇంద్రజాల మహేంద్రజాల, టక్కుటమార, గజకర్ణ గోకర్ణ మొ॥ 64 విద్యలను విలాసమునకు, ప్రదర్శించి ధనార్జనచేయుటకై విప్రవినోదులు, రాజాధిరాజులకు, జమీందారులకు, ప్రదర్శించి వినోదమును చేకూర్చెడివారు. ఇవియున్నియు మాయా విద్యలు అయిననూ ధనార్జనచేయుటకు సాధనములే కనుక, వీనిని కూడా కామ్యవిద్యలనవచ్చును.

2) బ్రహ్మవిద్యలు : బ్రహ్మవిద్య అనగా! ఈ విశ్వము యొక్క సృష్టి స్థితిలయములకు, మూలకారణమైయున్న, శక్తి లేక వస్తువు, లేక తత్వము, ఏదికలదో అది బ్రహ్మమని పిలువ బడుచున్నది. "బ్రహ్మము" అను శబ్దము "బృహి" వృద్ధ్ అను అర్థములో గొప్ప లేక పెద్దవస్తువు అనగా అంతకంటే పెద్దిది లేనేలేదని అత్యంత ఈ పెద్దవస్తువు ఆబ్రహ్మమును గూర్చిన సంపూర్ణ జ్ఞానమును తెలియజేసి, దానిని సాధించుటకు మార్గములను, లేక ఉపాయములను

బోధించునదే బ్రహ్మ విద్యతైత్తరీయ ఉపనిషత్‌లో బ్రహ్మము ఈ దిగువచెప్పబడినరీతిగా నిర్ణయించబడినది. "యతోవాయిమాని, భూతాని, జాయంతి, యేన జాతాని జీవంతి, యత్ప్రయం, త్యభి. సంవిశంతి తత్వజిజ్ఞాసస్వా. తద్‌బ్రహ్మేతి" అనగా దేని నుండి ఈ భూతములు (పంచభూతములు ప్రాణులు మొ॥ సర్వసృష్టికార్యములు) పుట్టుచున్నవో, ఆవిధముగా పుట్టినవన్ని నిలుచుచున్నవో, లేక బ్రతుకుచున్నవో, దేనియందు అవి అన్నియు మరల లీనమగుచున్నవో అది బ్రహ్మము. అనగా, సృష్టించుట, పోషించుట, నాశనము చేయుట, అను ముఖ్యమగు మూడు కార్యములు చేయుకర్త ఏదో, అది బ్రహ్మము. సృష్టించుట అన్నపుడు క్రొత్తగా ప్రథమ పర్యాయము. అదివరకులేని దానిని కల్పించుటకాదు. అట్లే నాశనముచేయుట అన్నపుడు, మరల పుట్టకుండా ధ్వంసముచేయుటయుకాదు. సృష్టియనగా ఆ బ్రహ్మ మునందే సూక్ష్మాతి సూక్ష్మముగా, అదివరకే దాగియున్న వానిని. ప్రకటపరచుటమాత్రమే, లేక ఆవిర్భింపచేయుట.(Manijestations) మాత్రమే. అట్లే లయము చేయుట అనగా నాశనముచేయుట అనగా! తిరోభావముచెందించుట అనగా కానరాకుండా చేయుట కనుక ఆబ్రహ్మము ఈ విశ్వమును ఒకప్పుడు చూపుచూ, ఒకప్పుడు దాచుచూ, ఆవిర్భావ, తిరో భావములను చెందించుచూ, "లీలాదేవతు కైవల్యం" అను రీతిగా అడలాడుచున్నది. అట్టి బ్రహ్మ విజ్ఞానమును, సాకల్యముగా తెలుపుటకు నిర్ణయింపబడినదే బ్రహ్మవిద్య అందుకు వివిధాపాయములు వుపనిషత్తులు సూచించినవి. ఇవియే 32 బ్రహ్మవిద్యలు, అవి అన్నియు, యోగపద్ధతులలో, లేక ఉపాసనా పద్ధతులో అయివున్నవి. బ్రహ్మవస్తుసాక్షాత్కారము ఈ సాధనలవల్ల కాగలదని ఆశింపబడినది. ఆ విద్యలు దశ ఉపనిషత్తులలో ప్రతిపాదింపబడినవి. ఆ విద్యలేవనగా 1. ఈశావాస్య విద్య, 2. నాచికేతవిద్య, 3. అంగుష్టప్రమితవిద్య, 4. సత్యకామ విద్య, 5. అక్షరపర విద్య, 6. ఆనందమయవిద్య, 7. పురుష విద్య, 8. సద్విద్య. 9. అంతరాదిత్యవిద్య. 10. ఆకాశవిద్య, 11. ప్రాణవిద్య, 12. పరంజ్యోతిర్విద్య, 13. కాంపరంజ్యాతిర్విద్యల్య విద్య, 14. ఉపకోసలవిద్య, 15) వైశ్వానరవిద్య, 16. భూమవిద్య, 17. దహరవిద్య, 18. మధువిద్య, 19. సంవర్గ విద్య, 20. పంచాగ్ని విద్య, 21. ఉద్దాల కాంతర్యామివిద్య, 22. గార్గ్యక్షర విద్య 23. జ్యోతి షాంజ్యోతిర్విద్య, 24. మైత్రేయవిద్య, 25. ఆదిత్య మండలస్థసత్యబ్రహ్మ విద్య, 26. అక్షిస్థసత్యబ్రహ్మవిద్య, 27. ఉపస్థికహాళవిద్య, 28. ప్రతర్ధన విద్య, 29. చాలాకినివిద్య, 30. అజావిద్య, 31. రుద్రవిద్య, 32. చతుర్ముఖవిద్య.

3. వార్తిక సిద్ధాంతము :- వార్తికమనగా ! వృత్తి అనగా మూలగ్రంథస్త లేక సిద్ధాంతములను విశదపరచి, విపులీకరించుగ్రంథమునకు వార్తికమనిపేరు. అగ్రంథకర్తకువార్తిక కారుడనిపేరు. అద్వైత సిద్ధాంతముపై వార్తికము రచించిన గ్రంథకర్త ఆది శంకరులవారికి శిష్యుడైన సురేశ్వరాచార్యులువారు, ఆయనవ్రాసిన "జీవన్ముక్తి ప్రకాశిక" అనుగ్రంథములో "నైష్కర్మేణ నతస్యార్థో: తస్యార్థోప్తినకర్తభిః నసమాధాన జప్యాఖ్యాం యస్య నిర్వాసనం మనః॥

అనుశ్లోకమున్నది. దీనికి" ఎవనిమనస్సు నిర్వాసనమైయుండునో, అతనికి కర్మసన్యాసముతో గాని, మంత్రజపంతోగాని, సమాదితోగాని కొంచమైననూ ప్రయోజనం లేదు. "అని అర్థము. ఈ శ్లోకము" "నిర్వాసనామౌన ముద్రనిష్ట" అనుస్థితినిసూచించుచున్నది. ఈ స్థితిని సూచించు గ్రంథమునకు "వేదాంతవార్తికమని" పేరు. ఇది ప్రత్యేకము ఏ గ్రంథమునకు వివరణ రూపము కాకపోయినను, అద్వైతసిద్ధాంతమునకే ఇది వివరణగ్రంథము అయి వున్నది. పరమానంద యతీంద్రుడను పేరుగలయోగి, (ఈతడు ఏకాలములోవాడో తెలియదు) అద్వైతము క్తాకలాపము, వేదాంతవార్తికము అనుపేరుతో వ్రాసిన తెలుగు గ్రంథము ఒకటి వున్నది. ఈ వార్తిక సిద్ధాంతమును 5 పేజీలలో ముద్రించి యున్నారు. ఇది దత్తాత్రేయ, సనకాదులమార్గమని, ఈ గ్రంథకర్త తెలియచేస్తు, "శుకసప్తగీతాసహస్రిక" అనుగ్రంథమొకటి వున్నట్లు పేర్కొన్నారు. అది బహుశా అముద్రితమగు సంస్కృతగ్రంథమేమో? ఈపరమానంద యతీంద్రులు, బహుశా దత్తాత్రేయ సాంప్రదాయకుడై వుండును.

ఈ వ్యాఖ్యాన శ్లోకమునకు పాఠాంతరముగా, ఈ అద్వైతముక్తాకలాపమను గ్రంథములో, శ్లో॥ విద్యాంతం, బ్రహ్మ విద్యాంతం, వార్తికాంతమగోచరం, సాంప్రదాయ రహస్యంతం మౌనం, నిర్వాససంహి, తతే అనుశ్లోకమున్నది.

ఈ నిర్యాసనామౌన నిష్టాస్థితినే, అఖండ బ్రహ్మకారవృత్తి అని, బ్రహ్మవిద్వ రిష్టబ్రహ్మస్థితి అని, కొందరందురు. ఇది అద్వైత సిద్ధాంతము ఉపదేశించు అతీతభావము అనియు, తురియాతీతమార్గమనియు, నిర్వాసనామౌన ముద్రనిష్టామార్గమనియు పేరుపొందినది. మహావాక్యార్థ జ్ఞానము ఆరూఢము చేసుకున్న సాథకుడే ఈ అసామాన్యోపదేశమునకు పూర్ణాధికారి. వేదాంతము వ్యవహార జ్ఞానశాస్త్రమైతే, వార్తికము పరమాత్మ జ్ఞాన శాస్త్రము లక్ష్యార్థము అయివున్నవి. ఈ వేదాంతసార సంగ్రహమునకే, అశృతార్థోపన్యానము అని. ఏకార్థోపన్యాసమని చెప్పబడినది నిర్యాసనామౌనముద్రనిష్ట జాగ్రతలో తురీయా తీతము.

ఈ అతీతమార్గమున 1. అద్యారోపావవాదనిరసన, 2. శ్రవణమనసని విద్యాసరాహిత్యము, 3. కర్మత్రయ రాహిత్యము, 4. గురుశిష్య రాహిత్యము. 5. వాసనాక్షయము, 6. మనోనాశము, 7. సర్వసమాద్యభావము, అనువానిని ప్రతిపాదించి, సామాన్య అద్వైత సిద్ధాంతమును ఖండిచుచున్నది.

శ్లో॥ ఉక్తానుక్త దురుక్తానాం । చింతాయత్రప్రవర్తతే,
తదేవవార్తకం ప్రాహు, ర్వార్తికంచ మహార్షయః ॥

తాత్పర్యము :- వేదశాస్త్రములు చెప్పినవికొన్ని, చెప్పనవికొన్ని, తప్పుగా చెప్పబడినవి కొన్ని; ఈ వార్తికమునందు చెప్పబడినవి, ఎట్లనగా! వేదాంతమునందు మహావాక్యర్థానుసారంగా, బ్రహ్మస్వరూపము అపరోక్షముగావింపబడెను. కానిఆబ్రహ్మమే

తానై నిలిచియుండు విధానము, భోధింపబడలేదు. మరిన్ని శ్రవణమనననిదిధ్యాసలచే, ప్రత్యైక్హ్మాక్యము సిద్ధించుటయు సరికాదు. ఈ విషయములను వార్తికము విమర్శించినది, వార్తికము విమర్శించిన అధ్యారోప అపవాద, నిరసనము శ్రవణ మనననిదిధ్యాస, రాహిత్యము, మొ॥వానిని ఈ గ్రంథకర్త రచించిన "పరిపూర్ణదర్శనము" అను గ్రంథములో 180 పే॥ నుండి, 205 పే॥ వరకు చూచి తెలుసుకొనవచ్చును. మరియు వుత్తర గీత, తేజో బిందోపనిషత్తు మొ॥ వానిని చూడవచ్చును. "విద్యాంతం, బ్రహ్మ విద్యాంతం, వార్తికాంతం॥ అనగా! విద్యలు అనగా కామ్యవిద్యలు అన్నియు, వ్యక్తిగతమైన కోరికలు తీర్చుకుని, ఈ లోకమునందు పొందదగినంత సుఖమును సంపాదించుకొనుటకే అయినవి. బ్రహ్మ విద్యలు. తానెవరో తెలుసుకొనుటకున్నూ అనగా! తన నిజ స్వరూపమెమో, తన లక్ష్యమేమో తెలిసికొనుటక మాత్రమే ఉద్దేశింపబడి తానే ఆ బ్రహ్మ స్వరూపమని నిశ్చయించినవి, వార్తిక మట్లుగాక, జ్ఞాన స్వరూపుడైన తాను, బ్రహ్మము కాననియు, బ్రహ్మ స్వరూపము తన జ్ఞానముచే తెలియతగిన, తన కన్యమైన, జ్ఞేయవస్తువనియు, నిర్ణయించినవి. ఇవి అన్నియి తరతమభేధములచే, సుఖములేక ఆనందముపొందుటకు వలయుపరంపరా సాధనములే గాని, దుఃఖభూయిష్టమగు జననమరణములను శాశ్వతముగా తొలగింపచేయనవి కావు. పరిపూర్ణబోధయే అత్యంత దుఃఖనివృత్తికి, అనగా! పునరావృత్తి రాహిత్యమును, సర్వభ్రాంతిరాహిత్యమునకూ, ఏకైకమార్గము, కాని అపూర్ణబోధ మహత్తమమైననూ అగోచరమై గురుకృపా ప్రసాదలబ్ధిచేగాని పొందరానిదై యున్నది.

అగోచరం : అగోచరం అనగా గోచరించనిది, అంటే కళ్ళకు మాత్రమేకానరానిది అని సంకుచిత తార్ధము గ్రహించరాదు. ఏ యింద్రియములకు తెలియవచ్చిననూ, అది గోచరించునదే అని గ్రహించవలెను, జ్ఞానేంద్రియములగుశ్రోత్ర, త్వక్కు, చక్షు, జిహ్వాఘ్రాణములును, ప్రాణేంద్రియములలో వ్యానమును, అంతరేంద్రియములలో, జ్ఞానమనోబుద్ధులున్ను, వస్తువును తెలుసుకొనుటకు సాధనములే (పనిముట్లే అయివున్నవి,) గోచరము అను శబ్దము ఎట్టిదో దృశ్యము అను శబ్దము అట్టిదే కంటికి కానవచ్చునవి మాత్రమే దృశ్యము కాదు. ఏ యింద్రియములకుగాని, లేక మనస్సునకు తెలియబడిననూ, అది దృశ్యమే అనవలెను. "మనష్షష్టానింద్రియాణి" అంటూ మనస్సు కూడ ఒక యింద్రియమే అని చెప్పబడినది.

"యద్దృశ్యం, తన్నశ్యం" అనగా పై విధముగా కానవచ్చే సమస్తము దృశ్యకోటిలోనకే చేరినవి, గోచరించే సమస్తముకూడా ఆ విధముగా దృశ్య కోటిలోనికే చేరును. ఏది దృశ్యమాన మగుచున్నదో అదినశించునదే, లేక అశాశ్వత మైనదే, అగుచున్నది. కనుక పంచతన్మాత్ర విషయములగు, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు, అన్నియూ అశాశ్వతములే అట్లే, జ్ఞానమునకు తెలియబడేదంతయు దృశ్యకోటిలోనికే చేరును. కనుక జ్ఞానమునకు విషయమగు విషయము కూడా అశాశ్వతమే. సర్వ త్రిపుటులను అటువలె

అశాశ్వతమైయున్నవి. జ్ఞాత్మ, జ్ఞానజ్ఞేయము, దృష్ట, దర్శన, దృశ్యలు, కర్త కర్మక్రియ అను త్రిపుటులయందు ఒకదానికొకటి సాపేక్షికములైనశ్యాపత్తికి లోనై యున్నవి.

ఈ విధముగా విచారించినచో, సృష్టి అంతయు మాత్రమేగాక, సృష్టికర్తయు కూ అశాశ్వతమే అని చెప్పవలసియుండును ఎవరికి, ఎప్పుడు, ఏది తెలియబడునో అదిఅంతం. అనగా!భాగవత కృష్ణదేశికేంద్రులపరి బాషలో 'ఎరుకకు ఎంత ఎరుకో అది అంతయూ ఎరు అయివున్నది. అనగా! అసత్యము అశాశ్వతము అయివున్నది. ఖండాఖండములగు వస జాతమంతయు, వేరువేరుగా తోచిననూ ఆసర్వపదార్థసమిష్టి స్వరూపమగు బ్రహ్మమే "ఏకమేవాఅద్వితీయం బ్రహ్మ" అని సర్వంఖల్విదం బ్రహ్మ' అనిన్ని 'బ్రహ్మైవేదంవిశ్వమిదంవరిష్ట అని, అఖండ ఎరుక అని నానావిధములుగా పేర్కొనబడినది. ఇదియే విజ్ఞేయ బ్రహ్మమ అనగా తెలియబడు బ్రహ్మము, దీనికన్యముగా, అది కానిది; ఇదిలేనిది అగు కేవ బ్రహ్మమునే; పరిపూర్ణ బ్రహ్మమని. నిష్ప్రతి యోగిక బ్రహ్మమని అవిజ్ఞేయ' బ్రహ్మమ పేర్కొనబడినది. అది యొక్కటయే, దేనికీ గోచరముకాక, అగోచరమైనది. "అస్తీత్యోపలబ్ధవ అవి అస్తీసేగ్రహతోన్యత్ర, కథం తదుపలభ్యతే॥ అనియు చెప్పబడినది. కాని అస్తి అన వున్నది. అని కూడా చెప్పరాక, అగోచరమై యున్నది. అస్తి అనుశబ్దమును నాస్తి అను శబ్దమున అపేక్షించున్నది కనుక సాపేక్షికమై, దృశ్యకోటిలోనికి లేదా ఒక త్రిపుటులోనికి చేరుచున్నది ' అస్తికూడా ఒక శబ్దమేకదా! 'నిశ్శబ్దో బ్రహ్మముచ్యతే, 'అనగా శబ్ద నిశ్శబ్దములుగాని కేవ నిశ్శబ్ద స్వరూపమగు కేవలంపూరిపూర్ణ బ్రహ్మము, అస్తి అను శబ్దముచేకూడా తెలుసుకొనరాని యున్నది. కనుకనే 'అగోచరం' అని ఈ శ్లోకమందు అభివర్ణింపబడినది. కేవలమ నిశేధముఖముగానే ప్రతిపాదింపబడవలసినదైయున్నది.

మహోత్తము :- "మహోత్తమం" అనగా సర్వోత్కృష్టమైనది, అనగా దానితో సమానమైన గాని. అంతకటె గొప్పదిగాని, మరొకటిలేదు. 'నత సమస్చాభ్యతికశ్చ శ్రూయతే" అంటే దా కంటే గొప్పది, గాని, సమానమైనదిగాని, వున్నదని ఎవరు, ఎప్పుడు, ఎక్కడను చెప్పలేదు

ఈ పరిపూర్ణ భోదకంటే గొప్పది మరియొకటి లేదు అనిచెప్పుటలో, ఇతర బోధలన్నియు, అనగా మత సిద్ధాంతము లేవియు, పరిపూర్ణ భోధనిచ్చు ఫలము అనగ శాశ్వత జన్మ రాహిత్యమును, కలిగింపజాలవు. జననమరణ భ్రాంతిరహితమునకు, పరిపూ బోధ ఒక్కటయే ఏకైక మార్గము. జ్ఞేయబ్రహ్మమును మాత్రమే ప్రతిపాదించు వివి సిద్ధాంతములన్నియు, అదికాదిక సాపేక్షిక ఫలములను కలిగించునేదే అయివున్నది. వివి సిద్ధాంతములను, విపులముగా చర్చించి, పరిపూర్ణ బోధ యొక్క మహాత్యమును నిరూపించుట గ్రంధ విస్తరభీతిచే విరమించబడయైనది. శాశ్వత జననమరణ భ్రాం రహితమునకు, ఈ పరిపూర్ణ బోధయే ఏకైక మార్గము. 'నాన్యఃపంధ్కాయనాదాయ విద్యతే

సర్వం శ్రీ సద్గురు చరణార విందార్పణమస్తు.